# నాగరిక

[ఆరుగురు సుప్రసిద్ధ బెంగాలీ రచయితలు రచించిన నవల]

అనువాదం:

"సత్య"




ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# ఈ నవలా రచయితలు

★ తారా శంకర బెనర్జీ

★ గజేంద్రకుమార మిత్ర

★ హరినారాయణ చటోపాధ్యాయ

★ నరేంద్రనాథ మిత్ర

★ సమరేశబసు

★ సరోజ్ రాయ్ చౌధురి

5



# నాగరిక

## 1

ఆమె అదృష్టం యిలాగ ఫలించిందని నాకు తెలుసు. ముందు ఆమె జీవితంలో ఏమి జరుగబోతున్నదో కూడ దివ్య దృష్టితో నేను చూచి చెప్పగలను. ఆమె తల్లి ఆ లావుపాటి బొమ్మగారు విథవరాలు కదలకుండా యింట్లోనే కూర్చుండి యీ ఘటనలన్నీ ఎలాగ అనుభవిస్తుందో. తన కూతురుతో ఆమె ఏదో అంటున్నది. కుమార్తె మాత్రం వినిపించుకోనట్టు తన సూట్ కేస్ సర్దుకొంటున్నది. తల్లి అన్న మాటలకు జవాబు చెప్పడానికి అవకాశంలేదు. తన పట్టుబట్టలూ అవీ తీసిపారేసి, ఏదో మామూలు పనివాళ్ళకు పనికివచ్చే సాధారణదుస్తులుతీసుకొంటున్నది. వాటిని సర్దుకోవటంలోనే ఆమె మనసు లీనమై వున్నది. చివరికి బెనారస్ చీర కనిపించింది. అది చేతులలోకి తీసుకొని ఒకటి రెండు సారులు అటూ ఇటూ త్రిప్పిచూసి అదికూడ తీసుకుపోవడమా లేదా అన్న ద్వంద్వంలో పడివుండగా తల్లి తనఉపన్యాసం పూర్తిచేసింది. కూతురు గాయత్రి చేతిలోవున్న బెనారస్‌చీర విసిరి పారేసింది.

"వద్దు- ఇది తీసుకువెళ్ళను. దీనివల్ల కలగబోయే ప్రయోజనం ఏముంది?"

అది విసిరివేస్తూ ఉంటే క్షణమాత్రం ఆమె ముఖం వికసించింది. చిరునవ్వుతో తల్లితో అంటున్నది.

"నా అదృష్టం యిలాగ వుంటే ఇవన్నీ యెందుకు? విధి నాతో ఈలాంటి వెటకారాలాడుతుంటే యిలాంటి భాగ్యచిహ్నాలెందుకు? నా అదృష్టం సరిగావుంటే ముక్కూ మొగం ఎరగని ఒక మోటు మనిషితో నాకు వివాహం ఎందుకు జరుగుతుంది? వివాహం అయింది. అయిన తర్వాత నేను యిలాగ వచ్చివేయవలసినఘటన ఎందుకు జరుగుతుంది? కోర్టుదాకా వెళ్ళి పరిష్కారం చేసుకొని ఈ సంపర్కం తెగ తెంపులు చేసుకోవలసిన అగత్యం ఎందుకు కలుగుతుంది?"

"కన్నకూతురువుగదా, కడుపార పెంచి అయిన కుటుంబంలో పడితే ఆనందిస్తావని ఈ పెళ్ళి చేశాం. కన్న బిడ్డమీద ప్రేమ నీకేం తెలుస్తుంది హతభాగినీ" అన్నది తల్లి.

"ఎందుకమ్మా, హతభాగిని అని నన్ను చీటికి మాటికి నిందిస్తావెందుకు? ఈ సంపర్కం తెగతెంపులు చేసుకొన్నందుకు నే నేమీ కించపడడంలేదు. నీ కన్నబిడ్డ ఇలాగ కడగండ్లపాలైనదని నీ వేమాత్రం విచారించనక్కరలేదు. ఇది నా సౌభాగ్యం అని భావిస్తున్నాను. దీనివల్ల నా భాగ్యం లోపించి హతభాగినిని కాలేదమ్మా. ఈ గాలి విసురులో, ఇది మంచికే అనుకో. ఇదే ఆడపిల్లకాక మగపిల్లవాడయితే, ఏం చేసివుందువు. నేను ఆడపిల్లనయినంతమాత్రంచేత జీవితమంతా వంటింటి కుందేలుగా గడపనవసరం లేదు. అలాగ జరగడానికి వీలులేదు. నే నింట్లో వుండను."



"గాయత్రీ! ఏమి టా మాటలు. ఒక్క చెంపకాయ వేస్తే తెగులు అణుగుతుంది. ఇంక ఎన్నడూ ఇలాంటి అవాకులు నీ నోటంట రావు."

"అలాగే చెంపకాయ కొట్టు—నే నేమీ అడ్డుకోను."

"అడ్డుకోవూ...ఏమే కోడలుపిల్లా! ఏరా మంటూ!"

"అన్నయ్య వదినతో సినీమాకు వెళ్ళాడు, ఇంట్లో ఎవ్వరూ లేరు."

"అయితే మంచి సమయం కనిపెట్టి నీ వేషం మొదలెట్టావన్నమాట."

"లేదు, వాళ్ళతో ముందు చెప్పేశాను...ఈ వేళ ప్రొద్దున్నే. ఏమైనాసరే, ఈ వేళ నేను వెళ్ళితీరాలి."

"ఎక్కడికి! ఎలాగ వెళ్తావు? నీవు ఆడదానివి, పడుచు దానివి అనే మాటమాత్రం జ్ఞాపకం ఉంచుకో...ఏమనుకొంటున్నావో."

"అద్దంలో ముఖంచూచుకొన్నాను. అవన్నీ మనస్సులో జ్ఞాపకం వచ్చాయి. చివరికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నాను. ఎక్కడికి వెళ్ళాలో యింకా సరిగా అనుకోలేదు. కాని నాలో నేను వితర్కించుకొంటే యీ విశాల లోకంలో కలిసిపోవడానికి పోతున్నట్లు అనిపించింది. ఏదో పిలుపు వినిపించింది."

గాయత్రి నవ్వింది. ఆ నవ్వు విచిత్రమైన నవ్వు. వెళ్ళాలనే నిశ్చయంతోకూడిన నవ్వు!

"...వెళ్తావు-ఎక్కడకి వెళ్తావు ఒంటరిగా? భయం వేయడంలేదు?-ఇదంతా సర్వనాశనానికే వచ్చింది పాపాత్మురాలా! సర్వనాశీ'

"సర్వనాశి అనేది నాకు తిట్టుకాదమ్మా - అది నాపట్ల సత్యకథ. అందుకు నేనేమీ అనను. అందరిలోనూ నీవూ, అన్నయ్య, పెద్దక్కయ్య, మావయ్య వీరందరినీ మించినవ్యక్తి నా భర్త అని చెప్పుకొనే విలాసపురుషుడు చరిత్రహీనుడు. అతడు అతని కుటుంబం, వీళ్ళంతా కలిసి నాజీవితం యిదివరకే సర్వనాశనం చేశారు. ఇంక నాశనంచేయడానికి ఏమి మిగిలింది? సర్వనాశి అన్నందుకు నా ఆక్షేపణ ఏమీ లేదు. ఒకటి, నీకు నేను చేస్తున్నపని నచ్చలేదు. కానీ, ఇంతమాత్రానికి నీవు నా గురించి బెంగపెట్టుకోవద్దు. ఇదే ధ్యాసగా పెట్టుకుంటే నీ మనస్సు మరింత పాడవుతుంది."

*　　*　　*　　*

1956వ సంవత్సరం. కలకత్తా నగరంలో పురాతన ప్రాంతంలో కాలీఘాట్. గాయత్రి యీ ప్రాంతంలోనే నివసిస్తున్నది. గాయత్రి తల్లి యీ ఇంట్లోనే ఉంది. కూతురును శాపనార్థాలు పెడుతున్నది. నవ్వీన నావచేలే పట్నాలు అవుతాయి అనడానికి యీ కాలీఘాట్ ప్రాంతమే చెప్పవచ్చు. ఒకప్పుడు కాలీఘాట్ ఒక చిన్న పల్లెటూరు. అయితే ఇప్పుడా ప్రాంతం చూస్తూ అదొకపుడు పల్లె అని ఎవరూ గుర్తించలేరు. 1920-21 వ సంవత్సరంలో మహిమ్ హాల్దారు వీధిలో బయలుదేరి ఒక కాలిబాట పల్లెపట్లులకు పోయేది. ఎదురుగా మురికి కాలవ ప్రక్కనే పాలవాళ్లు, గొల్లవాళ్ళు ఆవులను గేదెలను పెట్టుకుని చిన్న పాకలు వేసుకొని వుండేవారు. పూరిగుడిసెలు గొచ్చుకంపు అదిన్నీ. అక్కడికి గాయత్రి తల్లి పన్నెండేళ్ళ వయస్సులో అత్తవారింటికి కాపురానికి వచ్చింది. గాయత్రి తండ్రి తాతలు పౌరోహిత్యం చేసే పూజార్లు.

కొడుకు అనంతలాల్ మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసుచేసి షాహుకారు దుకాణంలో గుమాస్తాపని చేస్తున్నాడు. ఇంగ్లీషు చదువుకొని నౌకరీ చేస్తున్నప్పటికీ వంశపారంపర్యంగా వస్తూవున్న పౌరోహిత్యంకూడా చేస్తూవుండేవాడు. అయితే ఇంగ్లీషు వచ్చిన పురోహితుడు ఇతని కేమి వచ్చునని జనం అంతగా ఖాతరుచేసేవారుకాదు. అయినా ఒకటికి రెండురెళ్లు సంపాదించి, పౌరోహిత్యంచేసి, పెళ్ళిళ్లూ అవీ చేసి కొంత సొమ్ము కూడబెట్టాడు. ఆ పాలవాళ్ళతోను వాళ్ళంళోను ఆయన బాగానే పూజలు చేయించేవాడు.

అందుచేతనే అనంతలాల్ అంటే పాలవాళ్ళ నాయకుడనే వారు. అది కొంతవరకు నిజమే. పాలవాళ్ళకి కొంత ఉపకారంచేస్తూ తన స్వంతలాభంకూడా కొంత చూచుకునేవాడు. త్వరలోనే ఆ ప్రాంతమంతా చక్కదిద్ది పౌరోహిత్యం చేస్తూ అక్కడ షావుకారు లెక్కలు చూస్తూ చదువురాని ఈ పాలవాళ్ళకి మంచి చెడ్డ చూచి పెద్దదిక్కయి ఇళ్లూ అవీ కట్టించేవాడు. వారికి అక్కడ శుభ్రంచేయించి ఆగూడెంలో జనానికి సదుపాయాలు చేయించేవాడు. ఇంతలో సిటీ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు అనే పథకం వచ్చింది. అంతకు ముందే అనంతలాల్ ఒక గొల్లవాడి యిల్లు కొన్నాడు. ప్రక్కనే ఒక చిన్న దుకాణంకూడా పెట్టించాడు. పిత్రార్జితం ముప్పై సెంటుల నేల డెబ్బై సెంటుల నేలగా పెరిగింది.

పూర్వీకులు కట్టిన ఇల్లు పడగొట్టి రెండంతస్తుల మేడ చేశాడు. ఒక భాగంలో తానుండి పైభాగం అద్దెకిచ్చేశాడు. అక్కడే ఈ పాలవాళ్ళ మెజారిటీవల్ల వారి నోట్లతో కార్పొరేషన్ ఎన్నికలలో గెలిచిన కౌన్సిలరు ఉండేవాడు. అతనికి ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు. వాళ్ళంతా నవీన పద్ధతులలో పెరిగినవాళ్ళు. కొడుకు ఇంగ్లీషు బాగాచదివి ఎం.ఏ. ప్యాసుకావడానికి ప్రయత్నంచేయకుండా, కనుపించిన అందమైన అమ్మాయిలచుట్టూ తిరిగి వాళ్ళని స్తోత్రించేస్తూ పుణ్యాకవ్రతం చేస్తూవుండేవాడు. కాళీమాత చరణసరోజాలను పూజచేస్తే పల్లెటూరిలో ఏదో ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకుని నిశ్చింతగా ఉండవచ్చు. కాని అతనికి గాయత్రిని

కట్టబెట్టారు. అది మంటూకీ, ఆ అబ్బాయికీ వున్న స్నేహ సంపర్కంవల్ల జరిగింది. గాయత్రి అన్న మంటూ ముఖర్జి అయిదవ సంతానం. గాయత్రి ఏడవ కాన్పు బిడ్డ. మంటూ ముఖర్జి ఎంత ప్రయత్నించినా బి. ఏ, పూర్తిచేయలేక పోయాడు.

గాయత్రికి పదహారేళ్ళు నిండినా పెళ్ళికాలేదు. గాయత్రి ఇంట్లోనే ఉండి ఆవులకు మేతవేసి, ఇంటిపనులు చూచుకుంటూ ఇంటిచదువే చదువుకొనేది. మంటూ మాత్రం ఆటలకి పాటలకి, సినిమాలకి మరగి, అన్నిచోట్ల తిరిగేవాడు. కాని చదువుమాత్రం అబ్బలేదు. ఈ సమయంలో 1944-45 లో యుద్ధంతో వస్తువుల గిరాకీ పెరిగింది. నల్లబజారు వ్యాపారం కూడా పెరిగింది. అనంతబాబు గారి యిల్లు అద్దె పెరిగింది. రెండో అంతస్థుపైన మూడో అంతస్థు లేచింది. యుద్ధకాలంలో సిమెంటు, ఉక్కు, ఇనుము వీటికి పర్మిట్లు వుండేవి. తెలివైన కుఱ్ఱవాడు మంటూ. తన యింటికోసం పర్మిట్లు సంపాదించడంతో తృప్తిపడలేదు. ఒకసారి పర్మిటుకోసం ప్రయత్నంచేస్తేఅక్కడ జనసమ్మర్థం కనిపించింది. వారిలో కనిపించాడు నిమాయి చక్రవర్తి. అక్కడ తెలిసింది - పర్మిటు కావలిస్తే "సిమెంచక్కట్టి" వల్ల జరుగుతుందని. ఒక్క నమస్కారంపెట్టి ఒక వంద రూపాయలు దక్షిణయిస్తే చాలు! పర్మిటు వస్తుంది. నిమాయి చక్రవర్తి! ఎక్కడ దొరుకుతాడీ మహాపురుషుడు?

కాగితాలు పట్టుకొని చౌరంగీలో ఒక హోటలులో దొరికాడు నిమాయి చక్రవర్తి. సూటు, బూటు దొరలాగ వేషంవేసుకొని ఒక ప్రియబాంధవితో కూర్చుండి ఉన్నాడు నిమాయ్‌బాబు. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడని మాటలు జరుగుతున్నై. ఆ అమ్మాయికూడ కాలీఘాట్‌లోనే ఉంటుంది. పేరు రాధ. మంటూకి కూడా తెలుసు. ఆమె వేషభాషలు చూస్తే ఆశ్చర్యపడ్డాడు మంటూ. నిమో రాధను ఒక ఇంగ్లీషువాడితో పరిచయంచేశాడు. ఆమె అతనితో చనువుగా మాటలాడుతూంది. అదిచూచి మంటూ మరింత చకితుడయ్యాడు. పనిమీాద వచ్చాడు. ఒక వంద రూపాయలు నిమోకి ఇస్తూ—రాధద్వారా అందచేయాలనే అతని ఉద్దేశ్యం. నిమాయి ఇలాగన్నాడు:

"పర్మిటు నేను ఇప్పిస్తానుగా. పర్మిట్, పర్మిట్ అని చెప్పి మన స్నేహం పోగొట్టకూడదు. రాధ నాతో చెప్పిందిలే. మంటూబాబుకనక తలచుకొంటే లలిత, విశాఖ, బృంద వీరంతా రాకుండా చేస్తారని రాధ అలాగంది— వాళ్ళు మా బృందావనానికి రాకుండా ఎక్కడ మాన గలరు?"

"అబ్బో! మంచి సర్టిఫికెట్టే ఇచ్చిందే" కొంతకాలం తరువాత నిమాయి మంటూను పిలిపించాడు.



'బ్రదర్' నీకు వ్యాపారమంటే చాలా ఇష్టమట... మనమిద్దరం కలిసి బిజినెస్ ఎందుకు పెట్టకూడదూ? చూశావు కదా, పర్మిట్ కోసం జనం ఎంత కొట్టుమిట్టాడిపోతున్నారో! డబ్బు పెట్టుబడిపెట్టితే మనమే స్వంతంగా డీలర్ పర్మిట్ సంపాదించవచ్చు. ఏమంటావు? చేరతావా?"

"ఎంత డబ్బు కావలసివుంటుంది?"

"ఎంతోనా పదివేలు. బ్యాంకు బాలన్సు ఒక దొరకి చూపిస్తే వెంటనే పర్మిట్ వస్తుంది. దాంతో మూడు నుస తడాఖా!

మంటూ వచ్చి తల్లిగారు దాచివుంచిన సందువా పెట్టిలోంచి డబ్బు సంగ్రహించి తెచ్చాడు నాలుగు వేలు.

దాంతో వ్యాపారం మొదలుపెట్టారు. సిమెంటు అండ్ కో. కొద్ది రోజుల్లోనే మంటూ ముఖర్జీ పెద్ద వ్యాపారస్థుడై పోయాడు. పెద్ద బంగళా-డ్రాయింగ్ రూమ్. దానిలో అల్సేషియన్ కుక్క నగైరాలతో శోభాయమానంగా వుంది. టాక్సీలోనే ప్రయాణం. అరేబియన్ నైట్స్ కథలలో అల్లాఉద్దీన్ ఆశ్చర్యదీపం వంతుగా తయారయింది ఇతని జీవితం. నిమాయిచక్రవర్తి అప్పుడప్పుడు వచ్చి చూచిపో తూంటాడు. పిల్లలందరితో చనువుగా ఉంటూ ఉండేవాడు. సిమెంటు కంపెనీలో సీనియర్ పార్ట్‌నర్ ఒక్కసారి వెండి బంగారాలతో తులాభారం తూగుతున్నాడు. ఇంత సంపాదించిన తర్వాత ఏమయితే తనకేం? ఒక ఉపాయం తోచింది. "చూడు అమ్మా, మన గాయత్రికి నిమాయిమీద ఇష్టం కలిగేట్టు చెయ్—దానికి తగినవరుడు. నిమాయికి గాయత్రి నచ్చింది. కాని గాయత్రి కతనంటే నచ్చదు..."

నచ్చకపోతే ఆగుతుందా? ఒక సుముహూర్తంచూచి నిమాయి చక్రవర్తికి గాయత్రి నిచ్చి మంగళవాద్యాలతో పెళ్ళిచేశారు. గాయత్రి అత్తవారింటికి కాపురం వచ్చింది. తిరిగి పుట్టింటికి ఏడుస్తూ వచ్చింది. రాగానే తల్లి అడిగింది- "ఏమే అమ్మా, ఎందుకు ఏడుపు?"

"ఆయన తాగుతూ ఉంటాడు."

"తాగితే తప్పేమిటి? అతడు దొరలతో స్నేహం. తాగకపోతే బాగుంటుందా! అదొక మర్యాద. కాని కేసు పెందుకే తల్లీ! అది మంచిదికాదు."

కొన్నాళ్లు పోయిన తర్వాత నిమాయి గాయత్రి దగ్గరకి వచ్చాడు. మళ్ళీ తనతో కాపురంచేయమని కోరలేదు. ఆమెను వదలిపెట్టి ఇష్టంవచ్చినట్లు తిరిగి వచ్చేవాడు. భార్య వద్దంటే-ఏమిటీ "పెత్తనం, మేష్టరీ, ఐ డోంట్ మాస్టర్"... అనేవాడు.

తిరిగి ఆమె అతనితో కాపురంపెట్టింది. కొన్నాళ్ళు సినిమాల్లోలాగా క్యాలండరులో కొన్ని పుటలు గడచిపోయాయి. 1943-49 ఆంగ్ల రాజ్య పాలనలో తుది యవనిక జారిపోయింది. భారతదేశంలో వడుచువాళ్ళయుగం ప్రారంభమయింది. ఏరోప్లేనులో ఎక్కితే ఏడుగంటల్లో ఏడు సముద్రాలు దాటి రాగల్గిన వ్యవస్థ. మంటూ కూడా సిమెంటు కంపెనీ డబ్బు ట్రావెలర్సు చెక్కులుగా మార్చుకొని విదేశాలకు విమానయాత్రకు వెళ్ళాడు. నిమాయి తన భార్యను కాళీఘాట్‌లోని చిన్న ఇంటినుంచి బయటికి కదలకపోతే రాత్రింబగళ్ళు తిడ్తూఉండేవాడు.

"అమ్మాయి గాయత్రీ, చూడు - వాడిని జెయిలుకి పంపించి తీరతానులే, అప్పుడుగాని వాడి తెగులణగదు." అని తండ్రి ఒకనాడన్నాడు.

గాయత్రి "వద్దు, అలాగ చేయకండి ... అందరూ నన్నంటారు ... వద్దు" దానికి తండ్రి "నేను కోర్టుకేసు పెట్టాను. తన్నుకు చావండి, ఇంక మానేది లే"దన్నాడు...

నిమాయి తన బుద్ధి మానలేదు. నిర్లజ్జగా పనిచేస్తున్నాడు. ఎప్పుడైనా ఆమె పలకరిస్తే, ఎందుకలాగ నన్ను

హింసిస్తారు? నాతో మాటాడటానికి వీలులేదా? మా యమ్మ ఏమంటుందో తెలుసా?



నిమాయ్ – "మీ యమ్మ కావలసివస్తే అక్కడకే వెళ్ళు – పో, ఇప్పుడే పో" అని గెంటివేశాడు.

గాయత్రి పుట్టింటికి వచ్చివేసింది. అతడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. గాయత్రి ఇంటిలోనే ఉండిపోయింది. బయటికి వచ్చేది కాదు. సినిమాకి వెళ్ళేది కాదు. పిలుపులకి, పేరంటాలకి పోయేది కాదు. ఎవరైనా తోటివాళ్ళు చూడడానికి వస్తే మాటలాడేదికాదు. తనకూ యీ ప్రపంచానికీ, ఏసంబంధమూ లేనట్లు కూర్చుండేది.

ఇంతలో ఆమె తండ్రి అనంతలాల్ ఆకస్మికంగా మరణించాడు. టెలిగ్రామ్ పంపితే, మంటూ విదేశాల

నుండి తిరిగివచ్చాడు. తండ్రి మరణం తనకు మంచిగానే వచ్చిందని భావించాడు. గాయత్రి సంగతి విని "డైవర్స్ కేసు పెడదాం, ఏమమ్మా" హాఁ...అని మాట చెప్పలేక పోయింది గాయత్రి. హిందూ వివాహచట్టంమీద ఇంకా తర్జన భర్జనలు జరుగుతున్నాయి.

దానితర్వాత జరిగిన సంఘటన లెన్నో లేవు. మంటూ పెళ్ళి చేసుకొన్నాడు. గాయత్రి మొదట్లో కొంత చింతపడింది. తర్వాత తెలుసుకుంది యీ ప్రపంచంలో తనకు నా అనేవాళ్లు ఎవరూ లేరని. స్త్రీ వంటింటికి కమాండెంటుగా ఉండడం తప్ప చేసేదిలేదు. మంటూ ఆమె ఉనికి గమనించడంలేదు. ఇలాగ కొన్నిరోజులు గడచిపోయాయి.

గాయత్రి ఇన్నినాళ్లూ ఇంటి చాకిరీ అంతా చచ్చినట్టు చేస్తోంది. ఎన్నాళ్ళు చేస్తోంది? ఈవేళ వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నది. సంధ్యవేళ సూటుకేసు తీసుకొని పోవాలని సంకల్పించుకొన్నది. మంటూ భార్యతో సినీమాకి వెళ్ళాడు. అతడు వెళ్ళేముందు చెప్పింది. "నే నీ వేళ వెళ్ళిపోతున్నాను."

"ఒంటిగానా?"

తల్లి విచిత్రమైన మనిషి. బాధపడింది. ఈ వయస్సులో ఎక్కడికి పోతుంది. ఏమవుతుంది? ఇన్ని భయాలు. మంటూ మాత్రం ఒక్కమాట కూడ అనలేదు.

గాయత్రి సూటుకేసు చేతిలో తీసికొని వచ్చి వేసింది. వీథిలో నిలుచున్నది. కలకత్తాలో రాజవీథి వేలకు

వేలు వీధులు కలిసేచోటు. ఒకవైపుపోతే డల్‌హౌసీస్క్వేర్. మరొకవైపు రామబాగాన్, లాలిగండి స్టూడియో. మరొక దిక్కు కాలేజీస్క్వేర్. ఏ దిక్కుగానైనా పోవచ్చు. ఆ నాలుగు వీధుల మొగలో నిలిచి గాయత్రి తన భాగ్యదేవతను తనలో తాను ప్రశ్నించుకొంది. "ఏ దిక్కుగా తీసికొని పోతావు భాగ్యదేవతా? ముందు నాకేమి చేయనున్నానో!"

ఎదురుగా స్కూలుఫైనల్ ప్రైవేటు చెప్పి పరీక్షలకు పంపించే ట్యుటోరియల్‌స్కూలు.

# 2

చాలసేపు గాయత్రి ఆ నాలుగువీధుల మొగలో నిలిచిపోయింది. మనస్సులో ఆందోళన! కొన్ని క్షణాలవరకు ఆమెకేమీ తోచలేదు. లోలోపల పెద్ద సంఘర్షణ. ముందు ఏమి చేయాలో తెలియని అశాంతి. ఆమె అకస్మాత్తుగా ఇంటినుండి వచ్చివేసినమాట నిజమే ... ఆ రావడంలో గతాన్ని మరపించి ఎన్నో ప్రశ్నలువచ్చి నిలుస్తున్నాయి. "ఎక్కడికి వెళ్తావు? ఎక్కడ వుంటావు? నీకు ఎవరు ఆశ్రయమిస్తారు?" ఈ ప్రశ్నలకు జవాబు తెలియడంలేదు. ఆమె మాత్రం ఎదురుగా కనిపించిన దారివెంబడి నడిచిపోతున్నది. అలాగ రస్సారోడ్ అంతా నడిచింది. చౌరంగీ దాటింది. ధర్మతలాలో ప్రవేశించింది. అకస్మాత్తుగా ఒక పెద్దమోటారు ఆమెమీదికి వచ్చి చటుక్కున ఖంక్‌మని ఆగింది. ఆ కార్లో నుండి అతి పరిచిత కంఠం ప్రశ్న వేసింది.



"హల్లో, హల్లో, హల్లో ... ఇల్లాగ ఎక్కడికి బయలు దేరావు?"

ఆ ప్రశ్న విని గాయత్రి ఉలిక్కిపడి చూచింది.

ఆ! అవును. నిమాయ్! జీవితంనుండి శాశ్వతంగా నిష్క్రమించిన ఈ మనిషి మళ్ళీ యెలాగో తటస్థపడ్డాడని గాయత్రి భావన. అతనితో ఏసంపర్కమూ లేకుండా కంకణ విసర్జన జరిగింది. తెగ తెంపులు అయిపోయాయి. తిరిగి ఆ నిమాయ్ - తన జీవితానికి దుష్టపీడ, జాతకచక్రంలోని పాడు గ్రహం. మళ్ళీ ఈ నూతన జీవితపథంలో - ఈ గ్రహాన్ని భగవంతు డెలాగ తెచ్చిపెట్టాడు? ఆ అవమానం, ఆ పరా

భవం మరచిపోయి యితని బారినుండి బయటపడ్డం ఎలాగ? మనస్సు విహ్వాలమై ఎన్నో ప్రశ్నలు వచ్చి బాధిస్తున్నై. ఏమిచేస్తుంది? ఏమిచేస్తే బాగుంటుంది? ఎక్కడికయినా పారిపోతేనో? ఏ బాకుతోనో ఆ పాపాత్ముణ్ణి పొడిచివేస్తే! ఏమో ఏమీ పాలుపోవడంలేదు?

ఆమె ఏదీ చేయకపూర్వమే పెద్ద నవ్వు నవ్వుతూ ఆ నిమాయ్ చక్రవర్తి దగ్గరికి చేరుకున్నాడు. చాలా విలువయిన సూట్ వేసుకొని ఉన్న ఆ పెద్దమనిషి తన భాగ్యనౌకను "ఏ తీరమున చేర్చెదో నాయికా" అంటున్నట్టు గాయత్రిని పలకరించాడు.

"ఏమిటి సంగతి! ఎక్కడికి ప్రయాణం? చేతిలో సూట్ కేసు పట్టుకొని ఏదో పొరుగూరు బయలుదేరినట్టున్నావ్?"

ఇలాగ ప్రశ్నలవర్షం కురిపించి నిలుచున్నాడు నిమాయ్ చక్రవర్తి. నవ్వుతూ వికసించిన ప్రఫుల్లముఖం... ఆ ముఖంలో ఎక్కడా పశ్చాత్తాపంకాని, జరిగినదానికి లజ్జకాని లేదు. గాయత్రి బదులు చెప్పలేదు. బదులు చెపుతుందని నిమాయ్ అనుకొనికూడా వుండడు. అందుకే ఉత్తరక్షణంలో తిరిగి తానే ప్రారంభించాడు...

"ఓ చాలాకాలానికి కనిపించావు కదూ! ఇన్నాళ్ళూ నాగురించి బెంగచేత క్షీణించిపోయి చిక్కిపోయి వుంటావనుకొన్నాను. అన్నగారింట బాగానే ఉన్నట్టుగా ఉందే. ఆరోగ్యం చాలా ఇంప్రూవ్ అయినట్టుగా వుంది.

అయితే ఆ అన్నగారింట్లో ఎల్లకాలం బాగా చూస్తారని యెక్కడ వుంది? చూస్తుంటే నీకే విచారం ఉన్నట్టు తోచడంలేదే? చేతిలో ఆ సూట్కేసు పట్టుకొని వెళుతూ కనిపించావంటే నిజంగా లైట్ కార్నర్లోనే పడ్డావని తోస్తుంది. ఏం గాయత్రీ! ఈ రూపంలో కనిపించినందుకు థాంక్స్ చెప్పాలేమో!"

గాయత్రికి నవ్వు వచ్చింది. మనస్సులో పొంగివచ్చే విద్వేషం, కోపం, అవమానం అణచివేసి సహజకంఠంతో జవాబు చెప్పింది.

"నీ వ్యవహారమంతా మారిపోయి కొత్త అవతారం దాల్చినట్టు కనిపిస్తున్నదే! దీనికి కృతజ్ఞత చెప్పక్కర్లేదా?"

"అంటే బోధపడడంలేదు."

"ధన్యవాదాలు రొఖ్ఖపూర్వకంగా ఇవ్వఅక్కర్లేదా అని."

"అంటే నీ వుద్దేశం?"

"అర్థంకాలేదా! ఈ బుద్ధితో ఈ వేషంతో నీవు లోకాన్ని టోకరా తినిపిస్తున్నావు— నన్ను టోకరా తినిపించ డానికి ఇంకేముంది? జరగవలసినదంతా ఇదివరకే జరిగి పోయింది."

"ఓహో... బైజోవ్! చాలా మాటలు వచ్చాయే. ఇన్నాళ్లు కనిపెట్టలేకపోయానే గుర్రం గుడ్డు పెడుతోందని. సరి, నీకెంత సొమ్ము కావాలి రొఖ్ఖం?"

జేబులో చేతులుపెట్టి మనీపర్సు తీశాడు.

"ఎం తేమిటి? నీ వెంత యివ్వగలిగితే అంత యిస్తే సరి!" అంది గాయత్రి.

"అంటే-ఇంత కావాలని స్పష్టంగా చెప్పకూడదా?"

"నేను మా అన్నయ్య దగ్గరనుంచి వచ్చేశాను. ఇక్కడనుంచి నాయంతట నేను బతకాలనుకొంటున్నాను. ఈలోపున రెండు మూడురోజు లెక్కడయినా తలదాచుకోవడానికి ఆశ్రయం దొరికితే చాలు. దానికి కొద్దిగా సొమ్మింటే చాలు."

"అదా కథ! ... అయితే మంటూ భార్యకు నీకు వడతేదన్నమాట. అలాగ చెప్పు. ఆశ్రయంఅంటే నౌకరీ చేద్దామనా! మా కంపెనీలో ఒక క్లార్కుపని ఖాళీగావుంది. గ్రాడ్యుయేట్ అయిన స్త్రీ కావాలని ఎడ్వర్టైజ్‌మెంట్ చేశాం. నీవు వస్తానంటే మాకు సరిపోతుంది. స్త్రీ అయితే గ్రాడ్యుయేట్ కావాలనే లేదు, చదువున్నదయితే చాలు. నీవు చదువుకున్న చదువు చాలు" అన్నాడు నిమాయి.

"సంతోషం. మీ ఉద్యోగం గ్రాడ్యుయేట్ అమ్మాయికే యివ్వండి. మీ రిచ్చే ఆశ్రయం నా కక్కరలేదు."

"ఎందుచేత! ఒన్ జాబ్ ఈజ్ యాజ్ గుడ్ యాజ్ ది అదర్. తప్పేముంది!"

"తప్పేను మరి. ఆ దోషం నీలో వుంది. అయితే డబ్బు ఇవ్వవుకదూ, సరి వస్తాను" అన్నది గాయత్రి.

"అరే, ఇదిగో మాట! డబ్బు కావలిస్తే ఇస్తాను. కాని ఒక యువతికి కలకత్తా పట్టణంలో ఆశ్రయం దొరకడ

మంటే అంత సులభం కాదు...హోటలుకి పోయి ఉందా మనుకొంటే ముందుగా ఆ హోటలువాడే సందేహిస్తాడు."

"అదంతా నాకు తెలుసు. ఇలాంటి చిక్కులన్నీ ఎదుర్కోవాలనీ నాకు తెలుసు. తెలుసుండే యింటినుంచి బయటికి వచ్చాను."

అంటూ గాయత్రి నిమాయ్‌కి దూరంగా వెళ్ళిపోవాలని ప్రయత్నించింది. అయితే ఇలాంటి విషయాలలో నిమాయ్‌కి చాలా చాకచక్యంగా నడుపుకొనే అసాధారణ ప్రజ్ఞ వుంది. గాయత్రిని కదలనీయకుండా అడ్డం వెళ్ళి నిలబడ్డాడు...

"ఎందుకు తప్పించుకుపోతావు గాయత్రీ? నే నేమన్నా నరహంతక జంతువునా?"

"నా కళ్ళకి అంతకంటే దారుణమైనవాడి వే."

పరాభవంతో మండిపోతున్న గాయత్రి కన్నులలో నిప్పులు కురుస్తున్నాయి. ఇలాంటి నిప్పులు నిమాయ్‌తో కాపురం చేసేటప్పుడు కూడ కురిపించేది. కాని మరుక్షణంలో దైవంవంటి భర్త పాదాలముందు వాలిపోయేది. ఆశ్చర్యం! పరాభవాగ్నితో మండుతున్న ఆ కన్నులలో ఒక అద్భుత ఆకర్షణ జ్వలిస్తున్నట్లు అనిపించింది నిమాయ్‌కి...ఆమెను పోనీయకూడదు...

"సరే కానీ ... కలకత్తా పట్టణం : ధర్మతలాలోని సందు...నేను తలుచుకుంటే ఏమి చెయ్యాలంటే అది చేయగలను తెలుసా? గాయత్రీ, ఒక్క మాట చెప్తావింటావా?"

"చెప్పు" అన్నది గాయత్రి.

"నాతో కూడ వచ్చెయ్...ఏదైనా హోటలులో భార్యాభర్త పేరున ఒక రూం బుక్ చేసి అక్కడవుందాం... అది అబద్ధంకూడా కాదుగా?" అన్నాడు నిమాయ్.

"అబద్ధం ఎందుకు కాదు! ధర్మశాస్త్రం ప్రకారం నీకు నేను భార్యనుకాను. ఈవేళ లా ప్రకారం కూడ నీకు భార్యను కాను. అలాంటప్పుడు నీకూడా హోటేలుకన్న మాటేమిటి! స్వర్గంలోకి తీసుకెళ్ళినా రానవసరంలేదు."

"స్వర్గంలోకి వెళ్ళాలని నా కింకా లేదు. దాని మాట అటుంచు. ఈ రోడ్డుమీద జనం అంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు. రా...వచ్చి కారులో కూర్చో. అలాగ విక్టోరియా మెమోరియల్ వైపు షికారు వెళ్ళి వద్దాం... ఈలోపున ఏదో ఒక ఉపాయం ఆలోచిద్దాం...రా."

"రాను. వదులు. నాఉపాయం ఏదో నేను చూసుకో గలను."

గాయత్రి ముఖం త్రిప్పుకొంది. కాళీఘాట్ వైపు ఆమె పోవడానికి ఉద్యుక్తురాలయింది. నిమాయ్ భరించ లేకపోయాడు...ఇన్నాళ్ళు గాయత్రితో కాపురంచేశాడు. కాని అది నిత్య జీవనచర్యలాగ గడచిపోయింది. సత్యమో అసత్యమో చెప్పి మాయచేసేవాడు ... ఆమె చరణదాసి లాగ అత డేమిచేసినా శిరసావహించేది. ఆమె ఎదురుతిరిగేది కాదు. ఈనాడు తనకు కోరికకలిగింది. అది నెరవేర్చుకోవాలి, ఏమైనాసరే...అతనికి మంచి ఉపాయాలకంటె చెడ్డ ఉపా యాలే తోస్తాయి. ఇంతకాలం తన భార్యగావున్న స్త్రీ వద్ద

ఈ అపజయము అంగీకరించదు. అతనిలోని వివేకము ఓర్పు తెలివి నశించిపోయాయి.

గాయత్రికి వెనుకగా వెళ్ళి చేత్తో ఆమెను పట్టుకొని ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతో అతనిలోని హితాహిత జ్ఞానం లోపించింది. అది చూచి ఆ మార్గంలో పోతున్న జనం గుమిగూడారు. ఆ జనంముందు తన కథ అంతా చెప్పి, తన అవమానం గురించి నివేదించుకోవాలనే కోరిక గాయత్రికి లేదు. చేతిలో సూట్ కేసు అక్కడ పెట్టి తన శక్తి పూర్వకంగా చేతులతో విమాయ్ కంఠం నొక్కి ఒక్క త్రోపు తోసింది. చుట్టూ మరింత జనం మూగారు. ఇదేమిటీ గలాటా అని వాళ్ళకి కుతూహలం. ఈ నాటకం చూడాలని పెద్ద గుంపు కూడింది. వారిలో జనం వేలకు వేలు ప్రశ్నలు వేస్తున్నారు.

"ఏమయిందమ్మా!"

"అస లేం జరిగింది?"

"అత నేం చేశాడు?"

"మీకు అవమానంచేశాడా?"

"ఏమిటయ్యా పెద్దమనిషివి ఆడపిల్లను అవమానించడం...పెద్ద కోటూ సూటూ వేసుకోగానే సరా?"

ఇలాగ నలుగురూ నాలుగు మాటలూ మొదలు పెట్టారు ... కొందరు కలియబడి అతన్ని నాల్గు వడ్డించే వారేమో - కాని అతని వేషభాషలు చూచి వెనుకాడు తున్నారు. అతన్ని పరామర్శ చేయడం మొ॥ పెట్టారు. కొందరు గట్టిగా తన్నాలని చుట్టూ మూగారు విమాయ్ పశ్చాత్తాపపడ్డాడు. ఆ పశ్చాత్తాపం అన్యాయం జరిగి



"ఏమిటి ఏం జరిగింది? ఏం చేశాడు?" అంటూ
జనం గుమిగూడి ప్రశ్నించ సాగారు.

నందుకు కాదు, తన ఠీవి, హోదా మరచిపోయినందుకు. లేచి కారువైపు ఆమెను నడుపుతూన్నట్టు చూపి "ఏమిటి గోల...ఏదో భార్యాభర్తలమధ్య యిలాంటి కలహాలుంటే వాటిలో మీ కేం జోక్యం?"

అని గొంతుక తగ్గించి అంటున్నాడు. గాయత్రి, అక్కడ పెట్టిన సూట్ కేసు చేతిలోకి తీసుకొని జనంవైపు చూచింది.

"అంతా వట్టిది. ఈ లోకంలో నాకు భర్తే లేడు. లేడు. ముందతన్ని వదిలెయ్యండి. ఇలాంటి పాపిష్ఠి

వాడిని చంపితే మీ చేతులు కళంకితం అయిపోతాయి."
అన్నది గాయత్రి.

అతన్ని కొట్టాలని చేరిన జనానికి నిరుత్సాహం కలిగింది. ఇవేమీ చూడకుండా చటుక్కున మోటారుకారులో పడి తప్పించుకుపోయాడు నిమాయ్. తన జీవనవిధానంలో చిక్కుసమస్య ఏర్పడినపుడు ఇలాగ తప్పించుకు తిరగడమే అతగాడు నేర్చుకొన్న పలాయనమంత్రం తిరిగి పఠించాడు.—గాయత్రికి ఏ దిక్కుపోయినా ఒకటే...ఎక్కడికని వెళ్ళినా ఒకటే ... తిరిగి ఉద్దేశహీన లక్ష్యహీనయాత్ర. గమ్యంలేని ప్రయాణం...కాని ఆమె వెంటనే నిశ్చయం చేసుకుంది. లేకపోతే అక్కడ గుమిగూడిన జనంలోంచి తప్పించుకొని పోవడం కష్టం...ముందుకి సాగుతోంది. ధర్మతలాలోని మలుపు మళ్ళి, చిత్తరంజన్ ఎవిన్యూ... విశాలమైన వీధి—నిర్జన ప్రదేశంలో ఒంటరిగా నడుస్తూంది. క్రమక్రమంగా చీకటిపడుతున్నది. రాత్రివేళ ఎక్కడికో వెళ్ళాలి. ఏదో ఆశ్రయం చూచుకోవాలి ... అది తప్పించుకోడానికి వీలులేని ప్రశ్న. అది అంతకంతకీ పీడాదాయక ప్రశ్న అయింది.

"చూడండి...మిమ్మల్నే."

వెనకనుండి ఎవరో పిలుస్తున్నట్టయింది. అది విని గాయత్రి వెనక్కి చూచింది — పరిచయస్థులెవరూ లేరు. మాసిపోయిన పంచె. అలాంటిదే షర్టు వేసుకొని ముప్పై ముప్పైయొక్క సంవత్సరాల వయఃస్సుగల వ్యక్తి కనిపిం

చాడు. ఒక సాధారణమైన మనిషి, చదువుకొన్నవాడే... మంచివాడిలాగ ఉన్నాడు...కొంచెం పొడగరి ... విశాల మైన నుదురు, అందమైన ముఖం...కళ్ళు పెద్దవే... కళ్ళజోడు పెట్టుకున్నాడు...కొంచెం వంగి నిలబడ్డాడు... మనిషి చూస్తే మంచి కుటుంబానికి చెందిన పెద్దమనిషిలాగే కనిపిస్తున్నాడు.

"నన్నేనా మీరు పిలిచింది ?" అడిగింది గాయత్రి.

"అవునండీ... నేను మిమ్మల్ని చొరవచేసి పలకరించి నందుకు ముందే క్షమార్పణ వేడుకొంటున్నాను" అత నన్నాడు.

"దానికేంలెండి."

"నేను - అక్కడ, అంటే - ఆ గలాటా జరిగినచోట వున్నాను. అదంతా చూచినతర్వాత మీరు చాలా ఆప త్తులో వున్నారని తోచింది."

ఏదో జరిగిందేదో జరిగింది. ఈ ఆవత్తులోనుంచి మీ రెలాగ నన్ను ఉద్ధరించగలరని అనుకొంటున్నారు?"

"ప్రయత్నంచేయవచ్చుగా ... ప్రయత్నిస్తే తప్పే ముంది?"

"మీ రెవరో నాకు తెలియదు. - మీపరిచయమన్నా లేదు. మీరు ఏమిచేయగలరు నాకోసం! జనం నన్ను అవ మానించారు. వాళ్ళు నన్నర్థంచేసుకోలేదు. మీరు నాకూడా వస్తే మరోలాగు భావించరూ?...మరోలా అనుకొని అను మానిస్తే!"

"అవును, ఆమాట నిజమే. నన్ను మీారు ముందు పరిచయం చేసుకోలేదు. క్షమించాలి. నా పేరు మానస ముఖోపాధ్యాయ. ఎం. ఏ. ప్యాసుఅయ్యాను. మరే యోగ్యతలూ లేవని చెప్పి ఈ స్కూలుమాస్టరీ చేస్తున్నాను. మా యిల్లు యిక్కడనే దగ్గరగా వుంది. బజారులో... అక్కడ మా అమ్మ, తమ్ముడు ఉన్నారు. ఇది నా పరిచయం. మా స్కూలు సెక్రటరీ చాల మంచివాడు. ఆయన డాక్టరు. యీ ప్రక్కనే వారియిల్లు. అవసరమైతే వారిదగ్గరకు వెళ్ళ వచ్చు. నన్ను గురించి వారిద్వారా తెలుసుకోవచ్చు. నా విషయం ఎస్టాబ్లిష్ చేసుకోవచ్చు" అన్నాడతడు.

"ఎందుకు? అదేమీాం అక్కరలేదులెండి. నా పేరు గాయత్రి. మేము బ్రాహ్మలం. మీారక్కడ చూశారే ఆయన, ఒకప్పుడు నా భర్త. అంటే నన్ను వివాహంచేసి కొన్నవాడు. అతని దుర్వ్యసనాలవల్ల, తప్పుడు పనులవల్ల, విడిచిపెట్టి వదలివెయ్యవలసివచ్చింది. తర్వాత కోర్టులో కేసు పెట్టి సంపర్కం తెగతెంపులు చేసికొన్నాం. విడాకు లిచ్చే శాను. కొన్నాళ్ళు మా అన్నయ్యగారింట్లో వున్నాను. అక్కడనుంచి నేను స్వయంగా వదలిపెట్టి యిలాగ వచ్చే శాను. పెద్దగా చదువుకోకపోయినా చదువుకోవాలని కోరికవుంది. ఇక్కడనుండి ఎక్కడికి వెళ్ళాలో, ఎక్కడ వుండాలో తెలియదు. మొత్తంమీాద ఇది నా కథ" అంది గాయత్రి.

మానసముఖోపాధ్యాయ కొంతసేపు ఏమీ మాట్లాడ లేదు. చిరునవ్వు తెచ్చుకొని యిలా గన్నాడు.

"చూడండి...మీరు ఏ హోటలులోనైనా ఉండాలి. అంటే నాదగ్గర పెద్ద సొమ్మూ అదీ లేదు. అయినా హోటలులో మీకు చోటుదొరుకుతుందా అనేది సందేహమే. పోనీ మా స్కూల్ విద్యార్థులలో ఎవరి ఇంట్లోనయినా పెట్టాలంటే పెట్టవచ్చు. అయితే ఈ రాత్రివేళ అదికూడా సాధ్యంకాదేమో. అంచేత నా కూడా తీసుకొని వెళ్ళితే మా ఇంట్లో ఈ రాత్రి తలదాచుకొంటే అభ్యంతరం లేదేమో. ఈ రాత్రికి మా ఇంట్లో ఉంటే, రేపు ఎక్కడయినా ప్రయత్నం చెయ్యొచ్చు. ఎక్కడో అక్కడ ఆశ్రయం దొరకకపోతుందా? మా ఇంట్లో మా అమ్మగారున్నారు. ఆమెతో యిలాగ రోడ్డుమీద ఒంటరిగా చిక్కుపడిపోయిన ఈమె కనుపించారని ఏదో చెప్పి ఒప్పించవచ్చును. దానికి మా అమ్మ ఏమీ అనుమానపడదు. అందుచేత అలాగే చేస్తే ఏం?"

"అయితే పదండి...ఎక్కడికి వెళ్ళాల్సి ఉందో... అపరిచితుల ఆశ్రయంలో ఉండడంతప్ప ఇంక చేసేది ఏముంది? ఇలాగ రావడం మీ కేమీ అసౌకర్యం కాదనుకొంటున్నాను."

"ఏమీలేదు...మీరు మాయింటికి రావడమే చాలు... పదండి...ఆ సూట్ కేసు నాచేతి కివ్వండి...ఎంతసేపటినుంచి చేతిలో మోస్తున్నారో"

"కాళీఘాట్ దగ్గరనుంచి అది నా చేతిలోనే వుంది. అక్కడనుంచి యింతదూరం యీడ్చుకుంటూ వచ్చాను."

ఏమాత్రమూ సందేహించకుండా ఆమె సూట్ కేస్ అతనిచేతి కందించి ఇద్దరూ ఒకరిపక్క ఒకరు నడుస్తున్నారు. మానస్ ఒక్కమాట అన్నాడు...

"ఐతే ఒక్క సంగతి మీకు చెప్పాలి...మనం ఇలాగ వెళ్ళగానే మా అమ్మగారు మరోలా అనుమానం పడ వచ్చును. ఆ సందేహంతో ఏమైనా మా అమ్మ కోపంతో చెడ్డమాటలు అంటుందేమో, అవన్నీ విని మీరు మరోలా భావించకుండా ఉండాలని కోరిక...ఆమె ఏమైనా అంటే మనస్సు బాధపెట్టుకోవద్దు"...

చెడ్డమాటలు విని విని నాకు అలవాటయిపోయింది. అవి నాకు మంచిమాటలలాగే వినిపిస్తాయి. దానికి మీరేమీ కలవరపడనక్కరలేదు...నిశ్చింతగా ఉండొచ్చు" అంటూ గాయత్రి ముందుకు నడిచింది.

# 3

సందు కాదు మరీ చిన్న గల్లీ. అంత కంతకు మరీ సన్నం అయిపోయి, చీకటిగా ఉంది. మధ్య మధ్య-దూరంగా ఉన్న దీపస్తంభాల వెలుతురు చీలికలుగా వచ్చి పడుతున్నది. మానస్‌ముఖర్జీ కొంచెం ముందు ఉన్నాడు. వెనుకగా



గాయత్రి ఆమె వైపు తిరిగి, "అదిగో! అదే మా యిల్లు. ఇక్కడ చీడీలు విరిగిపోయాయి. కొంచెం జాగ్రత్తగా నడవాలి."

"అవును యీ చీడీలు నా శిరస్సులాగే చెక్కలయి నట్టున్నాయి" అని ఇంత దుఃఖంలోనూ నవ్వుతూ బదులు చెప్పింది గాయత్రి. అయితే ఈమాటలలో హాస్యంవమిటో సరిగా మానస్ ముఖర్జీకి అర్థంకాలేదు. అర్థంచేసుకోవాలనే ప్రయత్నంకూడా చేయలేదు. ఇంత రాత్రివేళ ఎక్కడికెక్కడికో తిరిగి, కొడుకు యింకా రాలేదే అని ఎదురుచూస్తూ, తీరా ఎదురుపడేటప్పటికి, తల్లి, మంచి వయసులోనున్న తరు

లేచి వెంటబెట్టుకొనివస్తే, ఆమెను చూడగానే రెండుకళ్లూ ఆశ్చర్యంతో పైకియెత్తి విస్మయంతో ఏమంటుందో అని మానస్ ఆలోచించుకొంటున్నాడు. ఆ ఆలోచనలో ఏమి చేయడానికి తోచని స్థితిలో ఉన్నాడు. ఆ విస్మయావస్థ యింకా పూర్తికాలేదు. రెండుకళ్ళూ పాడికళ్ళు చేసుకొని, యీ సంగతంతా చెప్తూ రాత్రంతా కాలక్షేపం చేయ వలసివుంటుంది ఇల్లో.

కొంతదూరం నడిచి, గాయత్రి అలసిపోయి ఆగాగ నిలబడిపోయింది. ముందు దారి తెలియడంలేదు. అయినా ఆమె హాట్ హాట్ మంటూ తన స్వంత యింటికి వెళ్ళినట్టే చురుకుగా వెళుతూవుంది. కాని దారితెలియక సందేహిస్తు న్నది. మానస్ బాబు గ్రహించాడు. "రండి! నా వెంట అడుగులు వేసుకుంటూ నడవండి. కొంచెం దారి చూచు కొని నడవవలసివుంటుంది. ఇదంతా చెత్తా చెదారం, మెట్లు విరిగిన దారి."

మానస్ ముందు జాగ్రత్తగా అడుగు వేస్తూవుంటే, గాయత్రి అతని వెనుకనే అడుగుజాడలను అనుసరిస్తూ వెళ్తు న్నది. ఆ దారంతా చీదరగావుంది. ఎక్కడో పైపుపగిలి నీరుకారుతున్నది. జర్ జర్ మని నీరు పైకి పొంగివస్తున్నది. ఇల్లు చేరుకున్నారు. తలుపులు మూసివున్నవి. మానస్ తలుపుమీద తట్టాడు. ఒకసారి, రెండుసార్లు. చడీ చప్పుడు లేదు.

గాయత్రితో తన యిల్లు గురించి ఎన్నో కథలు చెప్పాడు. ఇంతవరకు వాళ్ళిద్దరు కలిసి యింతదూరం నడచి,

యిన్ని సందులు తిరిగి చివరికి యీ గల్లీ చేరుకున్నారు. ఇల్లు వచ్చింది. అంత మరీ ప్రొద్దుపోలేదు. తలుపు కొట్టితే జవాబు లేదు." బయట అయితే సందడిగావుంది. కాని ఇంట్లో లేదు. మా అమ్మ పనులన్నీ పూర్తిచేసుకొని. నేను ఇంకా రాలే దని మా తమ్ముడికి అన్నం అదీ పెట్టి పడుకొనిఉంటుంది. తమ్ముడు, కొంచెంసేపు చదువుకొని పుస్తకాలు తలక్రిందు లుగా పెట్టి అలాగే పడుకొనివుంటాడు "యీ మాటలయితే గాయత్రికేసి చెపుతున్నాడు. కాని తలుపుకొట్టడం మాన లేదు. మరొకటి రెండుసార్లు గట్టిగా కొట్టి చూశాడు. ఊఁ, జవాబులేదు. ఈసారి మరీ జోరుగా తలుపు తట్టాడు.

లోపలినుంచి కంఠం వినిపించింది. "ఏమిరా నాయనా! మనూ! అపుడే వచ్చావురా?"

"అవునమ్మా! ముందే వచ్చేశాను" అని కొంచెం వెనుకాడుతూ అన్నాడు. గాయత్రి అనుకుంది, తన్ను లోప లికి రమ్మనడానికి అతడు సంశయిస్తున్నాడేమో అని. తలుపు తెరచింది. బయట దీపస్తంభం వెలుతురు తీసిన తలుపు సందులోంచి లోపల పడుతున్నది. ఆ వెలుతురులో మనుషు లయితే కనిపిస్తారుకాని గుర్తుపట్టడం కష్టం. సగం మాసిన బట్టలు కట్టుకొని బాగా దుర్బలంగావున్న శరీరంతో ఒక ముసలావిడ బయటికి వచ్చింది. మనూతో ఏదో అంటున్నది.

"ఒరేయ్ మనూ! యింత త్వరత్వరగా వచ్చావు. ఈవేళ ట్యూషన్ చెప్పడానికి వెళ్ళలేదా యేమిటిరా."

"అవునమ్మా - రెండవ ట్యూషన్ చెప్పడానికి వెళ్ళ లేదు. మొదటి ట్యూషన్ పూర్తిచేసి, వస్తూవుంటే అకస్మాత్తుగా వచ్చివేయవలసివచ్చింది."

"అకస్మాత్తుగా వచ్చివేయవలసివచ్చిందా! ఏమిటా అవసరం?"

తల్లి కంఠంలో కొంచెం ఉద్వేగంతో కూడిన నిష్ఠురం కలిసినట్టుంది. ఆమె అడిగిన దానికి జవాబు ఏమిచెప్పడమా అని మానస్ కొంచెం సంశయించి, తరువాత సర్దుకొని - "చూడు! ఈ అమ్మాయి మూలాన్ని, నేను అకస్మాత్తుగా వచ్చివేయవలసివచ్చిందమ్మా!" అని గాయత్రికేసి చూపుతూ అన్నాడు.

గాయత్రి ఎక్కడ నిలవబడివుందో అక్కడ ఏమీ కనిపించడంలేదు. అక్కడ మరీ చీకటిగా వుంది. ఆ చుట్టు పక్కల - వీధి దీపం వెలుతురు తప్ప ఇంట్లో ఏదీపమూ లేదు.

మానస్ చెప్పినమాట విన్న వెంటనే ఆ యువ్వ చర చరలాడుతూ బయటికి వచ్చింది. గాయత్రిని ముఖాముఖి చూడటానికి ప్రయత్నించింది. వెంటనే హతాశురాలయిన ముఖంతో కొడుకుతో అంటున్నది: "నీ వంటున్న దేమిటో నాకేమీ బోధపడడంలేదురా నాయనా! "ఈ అమ్మాయి ఎవరో నేను పోల్చుకోలేక పోతున్నాను."

"ఎలాగ పోల్చుకోగలవు? ఈ అమ్మాయిని నీ వెన్నడూ చూడనిదే. ఇంట్లోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టు - తర్వాత సంగతంతా చెప్తాను."

మానస్ లోపలికి ముందు ప్రవేశించాడు. అతని వెనుకనే తల్లి ప్రవేసించింది. తరువాత, బందబాడితో వున్న పాదాలను తుడుచుకుంటూ గాయత్రి మెల్లగా లోపలకు అడుగుపెట్టింది.

చిన్నయిల్లు, ఒక టేగది. దానిమధ్య తక్తాపోష్ (పెద్ద చదరపు బల్ల), మాసిపోయిన మాసికలబొంత - దానిలో ఎన్నో చిరుగులు, ఆపైన కొంత మేర అలాగ వదిలేసిఉంటారు. కొంచెం మేర గుడ్డ పరచి ఉంది. గోడమీద ఒక రంగుల క్యాలండరు ఎగురుతున్నది. హిమాలయపర్వత పీఠకమీద పార్వతీ పరమేశ్వరులు కూర్చుండియున్న చిత్రం, పార్వతి చేతికి దగ్గరగా మోటారు బ్యాటరీ; ఆమె బ్యాటరీని ఆమె ప్రశంసిస్తున్నట్లు మూకభంగిమ, క్రింద— ఆ బ్యాటరీగురించి ప్రకటన, నెలలవారీ తారీఖులు.

అక్కడ గ్రుడ్డి దీపంతో ఎక్కువగా ఏదీ కనిపించడంలేదు. గాయత్రి కన్నులు పెద్దవి చేసుకొని యిది కొంతసేపు పరీక్షించింది. తన మనసులో ఏమేమొ అనుకొంటున్నది. ఆమెను చూచి ఆ ముసలావిడ తిరిగి ప్రశ్నించింది. ఆ ప్రశ్నలలో తీక్షణత, కోపం కనిపిస్తున్నవి.

"ఈ యమ్మాయి యెవరో చెప్పావు కావేమిటిరా మనూ ? ఏమిటి సంగతి" మానస్ ఆ మాట వినిపించుకోకుండా చేతిలో సూట్కేసు ఆ తక్తాపోష్కు ఒకవైపు పెట్టి తానొక మూల కూర్చున్నాడు. తల్లికేసి చూస్తూ మెల్లగా చెప్తున్నాడు. "ఈయమ్మాయి దారిలో తటస్థపడింది. ఈ



గాయత్రి ముఖం
పులుకు పులుకున చూచింది ముసలమ్మ

ఒక్క రాత్రికి మాత్రం. మన యింటిలో ఆశ్రయం కోరి వచ్చింది అంతే–అంతకంటే ఆమెకు ఏమీ అక్కరలేదు."

ఆ ముసలితల్లి ఆ మాటవిని అంత సంతృప్తి పొందలేదు. గాయత్రి కేసి పులుకు పులుకున చూచి పరీక్షచేసింది. మంచి వయస్సులో వున్న యువతి. కలకత్తాలో ఆఫీసులలో పనిచేసే యువతులులాగ నీరసంగా చప్పిదవడలతో, అస్సుకొని పోయిన ముఖాలతో ఎండిపోయి ఉండే రకంలాగ తోచలేదు. మంచి వయస్సులో వున్నా, రంగుపోయిన చీరకట్టి, జీవితంలోనే రంగులు చూపించి, అభాసుపాలయిన అదృష్ట

హీన స్త్రీ లాగ కనిపిస్తున్నది. లేకపోతే ఇలాంటి వయస్సులో, ఇంత నిరాశ, నిస్పృహ ఇంత కాఠిన్యం, కార్పణ్యం ముఖంలో కనిపించవలసిన అవసరం ఏముంది ! జీవితంలో ఏవైనా లోపించవచ్చును. ఏవైనా దొంగిలించవచ్చును. కాని యౌవనము, రూపము, లావణ్యము ఎవ్వరూ హరించలేరు. అందుచేతనే ఆమె సచేతనంగా, చలాకీగా కనిపిస్తున్నది.

"నీ ముఖం వాచినట్టుగా ఉందే - యేడ్చి యేడ్చి కళ్ళు పెద్దవయ్యాయా?" అని ఆ ముసలావిడ ప్రశ్నించింది. అది తికమకలాడించే ప్రశ్న. జవాబు చెప్పడం ఏమీ కష్టంకాదు కాని, జవాబు చెప్పకపోయినా పరవాలేదు. ఆ ప్రశ్నకు జవాబు చెప్పాలీ అంటే ఒక్క మాటతో సరిపోదు. ఎన్నో సంగతులు చెప్పాలి. తాను ఒక పురుషునిచేత అవమానంపొంది, జీవితంలో వంచితురాలయిన కథ, దానికి సంబంధించిన అనేక విషయాలు, ఇవన్నీ చెప్పాలి.

"ఏమమ్మా ! దేనికీ సమాధానం చెప్పకుండా ఉన్నావు ? ఏంజరిగింది ! అకస్మాత్తుగ భర్త చనిపోయాడా?" అంటూ ముసలావిడ కంఠం సవరించి కొంచెం జాలిగా అడగడం మొదలుపెట్టింది. గాయత్రి మాట్లాడలేదు. గాయత్రి తరపున మానస్ బదులుచెప్పాడు.

"ఈ యమ్మాయి భర్తను కోల్పోయిన విధవరాలు కాదు. భర్త దుర్మార్గుడని, అతనితో విడాకులు తీసుకొని వచ్చేసింది. తిరిగి ఈవేళ రోడ్డుమీద ఆ భర్త యెదురుపడ్డాడు. బలవంతంగా కూడా తీసుకుపోబోయాడు. ఎంతో కష్టంమీద అతని చేతులనుండి విడిపించుకొని రాగల్గింది."

ఆ ముసలావిడ కొంచెంసేపు గాయత్రివంక చూచింది. ఆమెమీద పడిన దృష్టి త్వరలో మరల్చుకోలేకపోయింది. "ఏమిచిత్రం ! ఒక్కక్షణం దారిలో చూచినంత మాత్రం చేత యింత సమాచారం ఎలాగ తెలుసుకొన్నాడు మానస్? ఏది యేమైనా ఒక్క సంగతి స్పష్టపడింది. ఇన్నాళ్ళు కుఱ్ఱ వాడనుకొన్న, మానస్ ఈవేళ పెద్దవాడైనట్లు తోస్తున్నది. ఏదో చదువుకొని, కాలేజీకి వెళ్ళడం రావడం, స్కూలులో మేష్టరీచేయడం తప్ప వాడి కింతకాలం ఏమీ తెలియదు. చంటిపిల్లవాడికంటె అన్యాయం. ఆ స్కూలులో ఎంత మంది పిల్లలున్నారో, వాళ్ళకేంచెప్పాలో అదంతా తెలుసు- ఇంకేమీ తెలియదు—"సరేకాని మానస్! ఈలాంటి వయ స్సులో ఉన్న అమ్మాయి ఒంటరిగా బయటికి ఎలాగ వచ్చి వేసింది ?"

గాయత్రికి జ్ఞాపకం వచ్చింది. సరిగా ఇదే ప్రశ్న తన తల్లికూడ అడిగింది. ఈ లోకంలో అందరు తల్లులూ ఒకేలాగ ఆలోచిస్తారేమో ! అయితే, తన తల్లి ఇలాంటి ప్రశ్న వేస్తే వెంటనే తగిన సమాధానం చెప్పింది గాయత్రి. అలాంటి సమాధానం మానసబాబుతల్లికి చెప్తే పనికిరాదు. తల్లివద్ద, ఉన్న ఆశ్రయం వదలుకొని వచ్చివేసింది. ఇక్కడ మానస్ తల్లివద్ద ఆశ్రయం కోరి వచ్చింది. ఇక్కడ అలాంటి సమాధానం ఎలాగ చెప్పగలుగుతుంది. ఇంతకీ ఒక్క రాత్రి నిమిత్తం.

"చూడు అమ్మాయి—నీకు తల్లీ తండ్రీ ఉన్నారా?"

"నాన్నగారు చనిపోయారు. అమ్మ ఉంది."

"అన్నదమ్ములు లేరా ?"

"అన్న ఉన్నాడు. వాళ్ళ యింట్లోనే ఉన్నాను ఇన్నాళ్ళు. ఇంక వాళ్ళింటిలో ఉండడం అసంభవం అనిపించింది నాకు."

ఆ ముసలావిడ గాయత్రికేసి చాలసేపు అలాగ చూస్తూనే ఉంది. ఒక స్త్రీ, నిక్షేపంలాంటి సంసారం వదలిపెట్టి వచ్చివేసిందంటే ఎన్ని కష్టాలు అనుభవించి, ఎన్ని వ్యధలపాలు కాకపోతే, యిలాగ బయటికి రాగల్గుతుంది? వెనుకవైపు అంతా పరీక్షగా చూచి తిరిగి ముందువైపు జాగ్రత్తగా పరిశీలించింది.

ఏమిటో ఈ కాలపు ఆడవాళ్లున్నారే - ఎప్పటి కేం చేస్తారో, ఏమీ ఊహించలేము. పురుషులతో పోటాపోటీలు పడి, ట్రాములలో బస్సులలో ప్రక్క ప్రక్క కూర్చుంటారు. పురుషులంటే ఏవిధమైన భయభక్తులూ, ఏమీ లేవు. మనస్సులో ఏమనుకొంటారో ఏమిటో మరి. భర్తఅంటే వీళ్ళకు ఒక చినిగిపోయిన బట్టలాగ విడిచిపెట్టివేస్తున్నారు.

ఆ ముసలమ్మ ఇలా అనుకొనసాగింది.

దైవాపంటి భర్తను జీర్ణ వస్త్రంలాగ పరిత్యజించినంత మాత్రంచేత, వీళ్ళు ప్రతివ్రత అనీ, దేవి అని అలాగ పిలుచు కొంటారు. ఆ కాలంలో స్త్రీకి భర్తయే దైవం. ఇలాంటి వేవీ వాళ్ళ మనస్సుకి పట్టేవి కావు. ఇలాంటి ఆలోచన లుండేవి కావు.

ఏమి వచ్చినా, ఏమిచేసినా యీ కాలపు ఆడపిల్లల సంగతి ఏమీగా బాగుండలేదు. భగవంతుడి దయవల్ల తనకు

అటువంటి భయం లేకుండా చేశాడు. ఆడసంతానం లేదు. ఉన్న యిద్దరు పిల్లలూ మగనాళ్ళే. ఆడపిల్లలే ఉంటే గుండె మీద కుంపటిలాగ భరించడం కష్టమయ్యేది. ఏమైతేనేం ఎవ్వరినీ ఏమీ అనడానికి వీలులేదు.

ఇంతకీ ఎవరో అమ్మాయిని దారిలో కనిపించిందని యింటికి వెంటబెట్టుకొని వస్తాడా? ఎన్నాళ్ళనుండి వీళ్ళకి పరిచయముందో భగవంతుడికే తెలియాలి. లేకపోతే, దారిలో కనిపించిందని, ఒక పడుచుపిల్లను దడబిడలాడుతూ తిన్నగా ఇంటికి తీసుకొచ్చి ప్రవేశ గాడా?—తల్లి ఆ విధంగా పరధ్యానంగా ఉండడం మాన బు పరికించాడు. ఇదే అదను చూచుకొని గాయత్రికేసిచూచి ఇలాగన్నాడు:

"చూడండి—మీ కింక ఆలస్య మెందుకు? ఇప్పటికే ప్రొద్దుపోయింది. ఇంక మీరు పడుకోవచ్చు. ఇక్కడ విశ్రమించడానికి పెద్ద పరుపులూ అవీ లేవు. కష్టంగానే ఉంటుంది. అయితే ఇంతదూరం నడచి నడచి చాలా అలసి పోయి ఉంటారు—ఇక్కడే మీరు విశ్రమించండి."

గాయత్రి ఏమీ బదులు చెప్పలేదు. రోజంతా నడచి చాల డస్సిపోయింది ఆమె శరీరం. ఇంకా మరికొంత దూరం తిరిగితే అలాగే బల్లమీదికి కూలబడిపోతుంది. ఇంతవరకు నడచిన వీధుల్లో సందడి ధన్‌మని చెవులో గింగురు పెడు తున్నది. విశ్రమించితీరాలి.

ముసలావిడ ఆ సంగతి తెలుసుకోవాలని పెద్దగా సాగ దీయలేదు. కొడుకు చెప్పింది విని, ఇంగితం గ్రహించి సరి

పెట్టుకొని ఊరుకొన్నది. గదిలోకి వెళ్ళి—నేలమీద ఒరిగి ఉంది. తన్ను ఊరుకోబెట్టడానికి కొడుకు ఏవేవో కథలు కల్పించి చెప్పితే ఏం ప్రయోజనం? నిజం నిలకడమీద తెలుస్తుంది. కానీ, ఇంతలో మించిపోయిందేమున్నది! జరిగింది జరగనీ!

మానస ముఖర్జీ మళ్ళీ గాయత్రిని పలకరించాడు.

"చూడండి! మీకు పాపం ప్రక్క సరిగా లేదు. నేనేదో ప్రక్క వేసి యేర్పాటుచేస్తా నుండండి" అన్నాడు.

"ఏమీ అక్కరలేదు. ప్రక్కకేముంది, ఎక్కడ పడుకుంటే అదేప్రక్క. మీ కా శ్రమ అక్కరలేదు. నేనే వేసుకొంటాను" అని గాయత్రి అక్కడ బొంత ఒకటి పరచుకొని దానిమీద తలగడ పెట్టుకొని ఉంది."

"ఇక్కడ దోమతెర ఉంది. అదికూడ కట్టుకోండి. లేకపోతే యీ దోమలు చంపివేస్తాయి."

శుష్కహాసంతో గాయత్రి పలికింది. ఆ నవ్వు ఆమెలోని అందాన్ని స్వభావాన్ని పైకి చూపినట్టయింది. మెల్లగా చిన్న కంఠంతో అంది:

"ఇవి చంపివేస్తే మరీమంచిది. ఒకదెబ్బతో పోతుంది. ఇప్పటిలాగ మనిషిని పీల్చి పీల్చి, తల ముక్కలు ముక్కలు చేసి చీల్చడం వుండదు."

గాయత్రి...నగరమధ్యంలో పడిన అవమానం తల వంపులు మానస్‌కి చటుక్కున జ్ఞాపకంవచ్చింది.

"అయితే మరి మీ భోజనం అదీ యెలాగ?"

గాయత్రి పరిపూర్ణ దృష్టితో మానస్‌వైపు చూచింది.

"ఈయన వింతమనిషిలా వున్నాడే! ఇంక కడుపు నిండలేదని చింత యెందుకు—ఇక్కడ ముఖంనిండా దుప్పటి కప్పుకుని ముసుగువేసుకొంటే ఇంక కడుపుబాధ తెలియదు." అనుకొని మానస్‌తో తీవ్రంగా గాయత్రి అనివేసింది: "మా ఇల్లూ, వాకిలీ కుటుంబం అదీ ఎప్పుడైతే వదలిపెట్టానో అప్పుడే తిండీ తిప్పలు వదలిపెట్టేశాను. తిరిగి కంచం కడుపు ఆకలి అవేమీ లేవు. నన్నుగురించి మీరేమీ చింతపెట్టుకో వద్దు. నేను చాల అలసిపోయి ఉన్నాను. కూర్చుని మీకు జవాబు చెప్పడానికికూడ ఓపికలేదు. క్షమించండి."

నిజంగా గాయత్రి నిద్రపోలేదు. ఒక చేతితో కన్నులు మూసుకొని ఆ బొంతమీద పడుకొని ఉంది.

ప్రక్కవరుస వరండాలో మానస్ చూచి వచ్చాడు. తక్త్ పోష్‌మీద ప్రక్కమీద గాయత్రి పడుకొన్నది. అటూ ఇటూ ఉన్న రెండు గదులూ చూచి వీధితలుపులు మూసి వచ్చాడు. తల్లి మేల్కొనేఉంది. ఇక్కడ గాయత్రికికొంచెం భయంగా ఉంది. నిమాయ్ చక్రవర్తితో ముఖాముఖి పోట్లాడినపుడుకూడ ఇలాంటి భయంకలగలేదు. వేలకొలది నిమాయ్ చక్రవర్తివంటి మనుష్యుల్ని ఎదిరించగలదు. అటువంటివాళ్ళ ఆక్రమణ నుండి తప్పించుకొని రాగలదు. అత్యాచారాలను ఎదిరించగలదు. కాని ఇక్కడ ఉండడం భయంగాఉంది. పోనీ, యీ రాత్రివేళ తన సూట్‌కేస్



ఇంటిలోనుంచి మాటలు
వినబడుచున్నవి.

తీసుకుని తిరిగి బయటికి వెళ్ళిపోతేనో? తరవాత? అర్ధరాత్రి వేళ ఒంటరిగా వెళ్ళితే తనకు కలకత్తానగరం ఏవిధమైన స్వాగత మిస్తుంది? దారిలో మధ్యమధ్య, సందులోని చీకటిలో ఎలాంటి ఆపత్తులు, అపాయాలు పొంచిఉన్నాయో? ఇవన్నీ కోరి తెచ్చిపెట్టుకున్నట్టు, కొరవితో తల గోకి నట్టు, లేనిపోని ఆపదలు కొని తెచ్చుకొన్నట్టు అవుతుంది. ఇప్పటికి బయటికి వచ్చిందే చాలు – ఇంక ఏమి ఆపదలు కొని తెచ్చుకోవాలి అనుకొంది.

"అమ్మా! నా మాటంటే విశ్వాసంలేదూ! నే చెప్పిన దాంట్లో ఎంతమాత్రం అబద్ధంలేదు. ధర్మతలా దగ్గర ఆ

గలాటా జరిగిన తర్వాత ఆ అమ్మాయి గబగబ నడచు కొంటూ చిత్తరంజన్ ఎవెన్యూ రోడ్డులో ప్రవేశించింది. ఆమె నడక, ఆ ప్రయాణం తీరు చూస్తే, ఏదీ దారీ తెన్నూ లేని యాత్రలా కనిపించింది. అన్నిటికి తెగించి, ఒక గమ్య స్థానం అనేది లేకుండా ఏదో సాహసం చేస్తోందో అనిపించింది.

ధర్మతలా మలుపులో ఇంత గడబిడ జరిగితే, ఎవ్వరూ ఏమీ అనలేకపోయారు. ఎవ్వరూ ఆమెను పలకరించలేదు. ఆమె ఒంటరిగా ఫుట్‌పాత్ వెంబడి బయలుదేరి వస్తూ వుంటే ఒకళ్ళిద్దరు వెనకబడ్డారు. ఒంటరిది. పడుచుపిల్ల. వెంట బయలుదేరిన రౌడీమూక ఏంచేస్తారో – ఇంతవరకు జరిగింది కాక ఇంకేమి సర్వనాశనం అవుతుందో అనిపించింది అందుకని నేను సహాయపడి ఇలాగ తీసుకొచ్చానమ్మా" ఆ మాట పూర్తిగా వినకుండానే ఆ ముసలితల్లి కొడుకును గూర్చి నిష్టూరంగా మాటలాడింది.

"ఆవిడ కష్టం నీకు కష్టంగా తోచిందన్నమాట. ఆమెను చూడగానే నీకు జాలికలిగి, పాపం, మన యింటికి తీసికొచ్చావన్నమాట! ఆమె ఎవరో, ఏ కుటుంబమో, ఏం సాంప్రదాయమో తెలుసుకోకుండా, ఆ అమ్మాయి ఏమి చెబితే అది నమ్మి వెంటబెట్టుకొని వచ్చావా? ఒక స్త్రీ తన స్వంత విషయాల గురించి ఏది చెబితే అది నిజమని అనుకోకు. ఈ కాలం ఆడపిల్లలు, పురుషుల గురించి ఏవేవో కల్పనలు చేసి చెప్పడం అవసరం అయిపోయింది. అవన్నీ నమ్మితే ఎలాగు?" అంటూంది ఆ ముసలమ్మ.

"సరి దానికేం, ఆడవాళ్ళ మాటలు సత్యమో అస త్యమో ఆమాట అలాగ ఉంచు. ఒక్క-రాత్రికి ఆశ్రయమిచ్చి నంతమాత్రంచేత చెడిపోయిందిలేదుగా! తెల్లవారగానే వెళ్ళిపో తుంది. తర్వాత, ఆమెవల్లవచ్చే గొడవ ఏమీ ఉండదు."

"లేదంటే పోతుందా! ఒక్కసారి తెచ్చిపెట్టుకున్న తర్వాత!"

"అంటే?"

"అంటే ఏమీలేదు. ఈ అమ్మాయిని నీవు చూడడం, జాలిపడి, ఉపకారం చేయడం బాగుంది. నీ మనస్సులో ఎలాంటి దురుద్దేశాలు లేకుండా చేసుకోవచ్చు. కాని, ఒక్క సారి నీవు ఇలాంటి మనిషిని ఇంట్లో తెచ్చిపెట్టితే - లోకులు కాకులు - ఏమి అపనిందలు వేసినా వేయవచ్చును. అవన్నీ చూచుకో. నీవు స్కూలులో మాష్టరీ, రెండు ట్యూషన్లు వీటితో కాలక్షేపంచేస్తున్నావు. ఈ యింటిఅద్దె రెండు నెల లదిబాకీ. చిరిగిపోయిన బట్టలు మార్చుకోవటానికి టికానా లేదు. నీమంచి నీవు చూచుకోవడానికి సామర్థ్యంలేకపోయింది కాని, ఎవర్నో తీసుకొచ్చి లేని అపద నెత్తిమీద తెచ్చి పెట్టుకుంటావేం నాయనా?"

"అమ్మా!"

"నువ్వు నా కన్నులలో మట్టికొట్టడానికి ప్రయత్నిం చకు. ఆ అమ్మాయిని ఒక వంక చూడగానే కనిపెట్టాను. ఆ అమ్మాయి తన సంసారం విచ్ఛిన్నం చేసుకోవడమే కాక, ఇతరుల సంసారాల్లో నిప్పులు పెట్టడానికి బయలు దేరింది. లేకపోతే ఈ వయస్సులో యెవరైనా యిల్లువిడిచి

వచ్చి వేస్తారా? వివాహ సంబంధం, విడాకులు, పిడాకులు అదంతా వట్టిది. తన చేతులారా తాను నిలుచున్న కొమ్మ విరుచుకుంది: బొట్టు చెరిపేసుకొంది. మొగుణ్ణి వదలిపెట్టి వచ్చింది. పైగా అతన్ని అవమానించింది. ఇప్పుడు నీలాంటి మంచిమనుషులు కనిపిస్తే వాళ్ళను వెంటాడి సర్వనాశనం చేయడానికి బయలుదేరింది.". ఇన్ని మాటలు కటువుగా చెప్పేటప్పటికి, ఆమె చాల అలసిపోయింది.

"ఈ మాటలు ఇంక విన నవసరం లేదు. ధోరణి చూస్తే తెలుస్తూనే ఉంది. మూలాన్నే ఆమె పిల్లగించి వేస్తున్నది. అయ్యో - ఇక్కడ వుండి లాభం లేదు" అని గాయత్రి కన్నులనుండి ఉబికివచ్చే అశ్రుధారలు తుడుచుకొని పైకి లేచింది. సూట్ కేసు పట్టుకొని వెలుపలిద్వారం తెఱచి బయటికి వచ్చి వేసింది.

కలకత్తా నగరం అప్పుడే నిద్రనుంచి మేల్కొంటున్నది. చెట్లమీద ఒకటి రెండు పక్షులకలకలధ్వని. వీధులలో కలయంపి జల్లడం ప్రారంభమయింది. దీపాలన్నీ వెల వెల బోతున్నాయి. తెల్ల మొగం వేశాయి. మధ్య మధ్య ఒకటి రెండు మోటారుబళ్ళ శబ్దం.

గాయత్రి ముఖంతుడుచుకుని, చీర సద్దుకొని చేతిలో సూట్ కేసు పట్టుకొని బయట నిలుచున్నది. బయట అడుగు పెట్టినదో లేదో గబగబ నడుస్తున్నది.

"చూడండి"

గాయత్రి వెనక్కి తిరిగి చూచింది. మానస్ తలుపు తీసుకొని వెనుకనుండి పిలుస్తున్నాడు.



"ఇంత తెల్లారగట్లే యెక్కడికి ప్రయాణం."

"ఒక్క రాత్రికోసం కదా మీ ఆశ్రయం కోరింది" అని ఆమె జవాబు చెప్పింది.

"అదిసరే, ఇంత వేకువవేళలో వెళ్ళడానికివీలులేదు."

"ఎందుకులెండి-ఒక్క రాత్రి ఆశ్రయమిచ్చినందుకే మీపైకి ఈ గాలిదుమారం వచ్చిపడింది. ఇంకా నన్నిక్కడ ఉండమంటే, ఈ ఇంట్లో ఉండడానికే ఆస్కారంఉండదేమో" అని ఆమె జవాబు చెప్పింది.

ఒకటి రెండు క్షణాలు నిస్తబ్ధత. రెండు విధాల సందేహిస్తూ ఒక సంకోచంలో పడ్డాడు మానస్‌బాబు.

"మాఅమ్మ మాటలన్నీ విని మీరు ఇలాగ పారిపోవడం బాగాలేదు. ఆమె మాటలన్నీ అబద్ధాలని మీరు

రుజువు చెయ్యాలి. అందుకో[illegible]రు తిరిగిరావాలి. కేవలం అవమానకోసమే కాదు [illegible]ంటి ఆధునిక యువతులందరి నిమిత్తం మీరు మా యింట్లో ఉండి ఆ అపనిందలు తప్పని రుజువు చెయ్యాలి. ఈ కాలపు ఆడవాళ్ళు అందరూ అటు వంటివాళ్ళని చెప్పడంకోసమైనా మీరు ఆగిపోవాలి. ఆగి పొండి; రండి లోపలికి."

## 4

గాయత్రి తనలో తాను తర్కించుకోవడంలో పెద్ద మీమాంసలో పడింది. వెళ్ళిపోవడం మంచిదో కాదో తేల్చుకోలేకపోయింది. ఒకవైపు మానసబాబు తల్లి తనఎడల చూపుతున్న విముఖత, ఆమె అనుమానదృష్టి. మరొకవైపు ఆమె కుమారుని సాదరదృష్టి. అభిమానంతో కూడిన ఆహ్వానం. ఇలాంటి ఆహ్వానం గాయత్రి జీవితంలో ఎన్నడూ పొందలేదు. ఇలాంటి సాదరాభిమానాలు ఇదివరకు ఎన్నడూ ఆమెకు లభ్యంకాలేదు. ఈ ఆదరం విడిచి వెళ్ళిపోవడమూ, ఉండడమూ నిశ్చయించుకోవడానికి కొంచెం టైమ్ పట్టింది. ఆమె నిరుత్తరగా నిలుచుంది. మానస్ ఆమెవాలకం చూచి, మరొకలాగు పలకరించాడు.

"రాత్రి మీరేమీ భోజనంచేయలేదు. ఈవేళ ప్రొద్దున్నే ఏమీ తినకుండా మీరిలాగ వెళ్ళిపోతే, మాకు చాల కష్టంగా ఉంటుంది."

గాయత్రి అంది: "మరేమీ పరవాలేదు. ఒకటి రెండు రోజులు ఏమీ తినకుండా యిలాగ ఉండడ

నాకు అలవాటే లెండి. ఏమీ కష్టంలేదు. ఏదో నా కష్టం తీర్చాలని, మీ అమ్మగారి మనస్సు కష్టపెట్టడం ఏమంత మంచిది చెప్పండి."

మానస్ అంటాడు: "మా అమ్మగురించి మీరేమీ అనుకోవద్దు. రాత్రి ఆ అంధకారంలో మీ యెడల ఆమె అలాగ ప్రవర్తించినదానికి ఈవేళ తెల్లవారి, ఈ పగటి వెలుగులో తానే సిగ్గుపడుతుంది. ఒక్కసారి ఆమెకు సరిగా సంగతంతా చెప్పితే, రాత్రి మాటలన్నీ మరచిపోతుంది."

ఈ మాటలు విని, గాయత్రి నవ్వింది. "రాత్రి అమ్మగారన్నదానిని నే నెంతమాత్రం మనస్సులో పెట్టుకోలేదు. నే నేమీ తినకుండా వెళుతున్నానని అన్నారు కనక పదండి ఒక కప్పు టీ తీసుకొంటాను. అతిథి ఏమీ తీసుకోకుండా వెళ్ళిపోతే గృహస్థుకి ఏదో కీడు కలుగుతుందని మీ అభిప్రాయమేమో! పదండి" అంటూ గాయత్రి మళ్ళీ చిన్నగా నవ్వింది. మానస్ అప్పుడు మళ్ళీ అన్నాడు:

"దీనివల్ల మేలూ కీడూ కలుగుతుందనే ఆలోచనతో నే నిదంతా చేయడంలేదు."

"మరే ఆలోచనతో?" అని గాయత్రి ప్రశ్నించింది.

"నా మనసుకి అలాగ తోచింది. ఎంతో జాలితో నా హృదయం నిండిపోయింది. అంటే, ఒక వ్యక్తి మరో వ్యక్తి సహానుభూతి కోరుతుంది. తన్ను మరొకరు అర్థం చేసుకోవాలనీ, తన కష్టసుఖాలు అర్థంచేసుకోవాలనీ కోరడం సహజం. ఆ భావంతప్ప మరింకే ఆలోచన ఉంటుంది నాకు చెప్పండి"

గాయత్రి మరొకసారి మానస్‌బాబువైపు చూచింది. రాత్రి – ఈ మనిషిని చూస్తూవుంటే ఒక దుర్బలుడుగా నీరసంతో కృశించిపోయిన క్షీణకాయుడులాగ కనిపించాడు. కాని అతని మాటలు, చేతలు, ఆచరణ, అంతఃకరణచూస్తూ వుంటే, ఆ దీనత, ఆ దుర్బలత ఎక్కడా కనిపించడంలేదు. మనిషి అంటే, ఇలాగ ఉండాలి. గాయత్రి మనస్సుకి అతని పద్ధతి నచ్చినట్టనిపించింది. ఆమెలో అణిగివున్న జీవనరాగంతో శ్రుతిచేర్చడానికి ఇతనిలో ఏదో అనుకూలత కనిపిస్తున్నది. ఆ జీవన తంత్రులు కంపిస్తున్నాయి. నూతన ఝుంకారంతో మేళవించి మ్రోగుతున్నాయి. అతనిలో – ఆ దుర్బల వ్యక్తిలో ఎంత శక్తి, ఎంత నిబ్బరం! ఈ సంఘాన్ని సమాజాన్ని ధిక్కరించి, యీ సంసారంలో మంచి చెడ్డలు నిబ్బరించుకొని నెగ్గుకొనిరాగల సామర్థ్యం ఈ సన్నటి మనిషిలో ఉన్నాయి. ఆశ్చర్యం! గాయత్రి విస్మయంతో చిరునవ్వు నవ్వి ముందుకు అడుగువేసింది. కన్నుల చూపుమాత్రంతో ఒక మనిషిలోని ఆంతర్యం ఎంతవరకు గ్రహించగలదో అంతా గ్రహించింది. మానస్ ఆ మౌనాన్ని భంగపరుస్తూ అడిగాడు: "ఏమిటీ ఆలోచన? చెప్పండి, వచ్చేదీ రానిదీ?"

"రాకేం చేస్తాను? ఎక్కడికి పోతాను? పదండి." అని నవ్వుతూ గాయత్రి బదులుచెప్పింది.

అదే, పాతబడినయిల్లు. వడవలో తక్తపోష్. దాని మీద మూడు పక్కలు, దండెంమీద సగంమాసిన బట్టలు.

తెల్లవారింది. అయితే, ప్రొద్దుపొడుపు వెలుగంతా ఆ యింటిలో ప్రవేశించడానికి ఇంకా పూర్తి అనుమతి పొందలేదు. మానసబాబు తల్లి సత్యభామ అప్పుడే లేచింది. ఇంకా పడుకొని దుప్పటి కప్పుకొని ఉన్న చిన్న కొడుకును తట్టి లేపుతూవుంది. "ఒరేయ్ - తపూ, తపూ - లేవరా నాయనా! తపనూ, యీ వేళటికి లేవవేమిట్రా?"

తపన్‌ముఖర్జీ - ప్రక్కమీదనుంచి కదులుతున్నాడు.

"లేస్తున్నాను అమ్మా!" అయితే పక్కవిడిచి లేవడానికి బుద్ధిపుట్టడంలేదు.

"అయ్యగారు లేవడానికి అపరసంధ్య కావాలేమో-మిట్ట మధ్యాహ్నం అయింది. ఇంకా ప్రక్క వదలనంటావేమిటి-లే! ఇలాగ దొరలుతూ ఉంటే దొరలడమే. లే-లేచి పుస్తకం తీసి చదువుకో! పరీక్షలు దగ్గరపడుతున్నాయి. వాటిగురించి నీకేమన్నా భయమూ భక్తీ, భావనా ధావనా ఏమన్నా ఉన్నాయా?" తపన్ ఇంక కన్నులు మూసికొని ఉండలేకపోయాడు. లేచి కూర్చున్నాడు. పద్ధాలుగేండ్ల వయస్సు పిల్లవాడు. మంచి చురుకైన చెహరా! చూడగానే మానస్ బాబుకి తమ్ముడని ఇట్టే పోల్చుకోవచ్చు. కళ్లూ ముఖం మానస్‌కంటె విశాలమైనవి, ధారాళమైన విన్నీ. అందుచేత మంచి తెలివితేటలుగల్గి—బుద్ధిమంతుడు, ప్రతిభావంతుడైన పిల్లవాడుగా కనిపిస్తాడు.

తపన్ లేచి వాళ్ళమ్మని అడిగాడు - "అమ్మా! అన్నయ్య ఏడే?"

సత్యభామ మొదలుపెట్టింది - "తెల్లారి లేచింది మొదలు, ఎవరు ఎక్కడికి వెళ్ళిందీ చూస్తూ ఉండడమే పని అనుకున్నావా ఏమిట్రా! బాబూ! అరగంటనుంచి ఇదంతా సర్ది తుడిచి శుభ్రంచేసి, ఇంటిపనులు చేసి నిన్ను లేవగొట్టడంతోనే సరిపోయింది. వాడెక్కడికి వెళ్ళాడో, ఏమిచేశాడో ఇదంతా ఆరాతీయడానికి నాకు టైములేదు. నాయనా! ఇంతవరకు పచ్చిమంచినీళ్లు తీసుకోలేదు వాడెక్కడికి వెళ్ళాడో, ఎప్పుడు వస్తాడో ఏమిటో?"

తపన్ నవ్వుతూ అమ్మతో అన్నాడు: "ఈ మాటలతో సరిపోతుంది అమ్మా నీకు! అన్నయ్య గురించి ఆ మాటలన్నీ అనడంతోటే టైమ్ గడచిపోతున్నది. నాకు ఇలాంటివాటితో టయిమ్ ఎలాగ సేవ్ చెయ్యాలో తెలుసుకోలేదు." ఇంతలో మానస్ యింటిలో ప్రవేశించాడు. వెనువెంటనే గాయత్రి, ఆమె సూట్ కేసు. ఆ పిల్లవాడినిచూచి గాయత్రి నవ్వుముఖంతో అంది.

"ఈ అబ్బాయి మంచి చలాకీగా ఉన్నాడే. మీ చిన్నతమ్ముడులాగున్నాడు." మానస్ బాబు పరిచయం చేశాడు. "అవును. వీడు చాలచిన్న. మధ్య ముగ్గురుచెల్లెళ్ళు తమ్ముళ్లూ ఉండేవారు. వాళ్ళెవరూ లేరు, ముగ్గురూపోయారు." ఆమాట చెపుతూవుంటే, పోయిన చెల్లీ తమ్ముళ్ళమాట జ్ఞాపకంవచ్చి, కొంచెం పరధ్యానంలో పడ్డాడు. గాయత్రి

మాటాడలేదు. ఇంతలో లోపలిద్వారంనుంచి, సత్యభామ వచ్చి కొడుకుకేసి చూచి అడిగింది:

"ఏమిరా నాయనా! నీ మార్నింగ్ వాక్ పూర్తి అయిందా?" మానస్ ఆశ్చర్యంతో "మార్నింగ్ వాకా!" అన్నాడు.

సత్యభామ: "ఆకాశంవిరిగి మీదపడిందా మార్నింగ్ వాక్ అంటే? నీ ఇంగ్లీషులు నింగులీషులూ నాకేమి తెలియవు కాని, తెల్లారి లేవగానే - బయటికి షికారు వెళ్ళిరావడం మార్నింగువాక్ అంటారటకదూ! తప్పా! ఏది రైటో నీవే దిద్దుకో. 'మనూ.'

"నీఇంగ్లీషు తప్పని కాదమ్మా-మార్నింగ్ వాక్ కోసం కాదు నేను వెళ్ళింది. గాయత్రీదేవి వెళ్ళిపోతానంటేను పోనీయకుండా మళ్ళీ మనింటికి తీసికొని వచ్చాను."

సత్యభామ గంభీరముఖంతో మాట్లాడింది. 'బాబూ, వెళితేవెళ్ళు. నీ వెక్కడికి వెళ్ళావు, ఏంచేశావు అని అడగడం లేదు. నాయనా - ఇది నీ సంసారం నీ యిల్లు; నీ కుటుంబ వ్యవహారం; నీ బంధుమిత్రులను తెచ్చి, ఒక్కరోజు కాదు, ఎన్నిరోజులు పెట్టుకున్నా, యీ లోకంలో ఎవ్వరూ నిన్ను అడగడానికి వీలులేదు."

ఆ మాటలు వినగానే మానస్ బాబుకీ, గాయత్రికీ కూడ ఎలాగో అయిపోయింది. ముఖాలు రక్తహీనమై వెల వెలపోయాయి.

సత్యభామ రాత్రి యెలాగుందో, అప్పటికీ యిప్పటికీ ఏమీ మారలేదు. రాత్రికంటే, ఇంకా జాగ్రత్తగా పరిశీ

లించి, ఇంకా లోతుగా చూచి మరింత తీక్షణతరంఅయింది. మానస్ భయపడ్డాడు, తన తల్లి తీరు చూచి, గాయత్రి అవమానం సహించలేక వెళ్ళిపోతుందేమోనని. ఆమెకు పరాభవం కలిగించే మాటలంటే, తిరిగి వెంటనే వీధిలో ప్రవేశించి వెళ్ళిపోతుందేమో యని ఆతని భయం. అందుచేత – తాను గాని, తల్లిగాని ఏమీ అనకుండా, ఎంతమాత్రం నొప్పించకుండా చెయ్యాలని అతని ఉద్దేశం. ఆమె నొచ్చుకోకూడదు: నొప్పించకూడదు: "అమ్మ – ఎంతో మంచిది. ఆమె కన్నులలో మణిదీపాలవంటి అనురాగకాంతులు కనిపించడానికి బదులు ఏమి టీ అవహేళన దృష్టులు. పాపం! ఏఆశ్రయమూ లేని ఒక అభాగిని స్త్రీమీద యిలాంటి అకారణ కోపం ఆశ్చర్యంగా ఉంది. నాకెంతో బాధగా ఉంది." అని తనలో తాను ధ్యానించుకొంటూ ఉంటే, గాయత్రి అలాగ చేయలేగు. ఆమె కోపించి బయటికి వెళ్లిపోలేదు. సత్యభామవైపు తిరిగి చెప్పింది.

"పిన్నిగారూ! మీ రన్నమాట నిజమే. మానస్ బాబు తన యిష్టంవచ్చినవాళ్ళని తెచ్చి, యెన్నాళ్ళయినా యీ యింట్లో పెట్టుకోవచ్చు. కాని ఆయన స్నేహితులెవ్వరూ ఒకటి రెండు రోజులకంటే ఉండరులెండి. మీకా భయం అక్కరలేదు. అన్నట్టు – రాత్రి నేనేమీ తినలేదు. పిన్నిగారూ! కడుపులో మంటలు గంతులువేస్తున్నాయి. ఏదీ చూడనీయండి – వంటింట్లో ఏ మున్నాయో. టీ నేనే కాచిపెడతానులెండి. కుంపటి, అవీ చూపించండి. నా చేతులతో తయారుచేసే టీ ఎలాగుంటుందో మెచ్చి



"పిన్నిగారూ! మీ రన్నమాట నిజమే.
మానసబాబు తన యిష్టంవచ్చిన
వాళ్లనితెచ్చి యెన్నాళ్ళయినా ...."

చూడండి" తల్లి వెంటనే అందుకొని "టీలూ - గీలూ నాకు అలవాటులేవు. నీకు కావలిస్తే టీ చేసి పెట్టుకో. మానస్ జాతిధర్మం అవీ పాటించడు. ఎవ రేది చేసిపెట్టితే అది తినేస్తాడు. "మడా మట్టిగడ్డలా!" అన్నదానికి గాయత్రి బదులు చెప్పింది.

"అవును పిన్నిగారూ! చూడగానే అర్థమయింది లెండి. ఈ మడీ తడీ పాటించని మ్లేచ్ఛులాంటివాడు కాడు

కై తే, ఆ తల్లి కష్టాలు ఎటువంటివో నేను బోధపరచుకో గలను."

తపన్ పళ్ళుతోముకొని, ముఖం కడుక్కొని లోపలికి వచ్చాడు. ఇంటి మధ్యగా ఒక అపరిచిత సుందరస్త్రీ నిలుచుండి ఉండడం చూచి చాల ఆశ్చర్యంకలిగింది. అల్లాదీన్ అద్భుతదీపం చూడిరి ఈ యందమైన అమ్మాయి ఎక్కడ నుండి వచ్చింది. కొత్తగావచ్చిన యీామెతో మాటలాడి పలకరించాలని అతని మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. అయితే అపరిచిత స్త్రీతో ఏమని మాటలాడుతాడు? పలకరిస్తే ఏమి అమర్యాదగా ఉంటుందో! ఆ సంగతి తపన్ ఎరుగును. పరిచయంలేని ఏ అమ్మాయితోనైనా పలుకరించి మాటలాడడం మర్యాదకాదు. ఆ జ్ఞానం అతనికుంది. అందుకని, ఆమెను పలుకరించకుండా సంగతి తెలుసుకోవాలని, సత్యభామ చెవి దగ్గర ముఖంపెట్టి, మెల్లగా అడిగాడు. అమ్మా! ఈవిడెవరే?"

"మీా అన్నయ్యనే అడుగు నాయనా! వాడే చెప్తాడు అన్ని సంగతులూ" అని సత్యభామ బదులుచెప్పి, గిరున లోపలికి వెళ్ళిపోయింది. తాను టీ పెట్టే యేర్పాటు చేయడానికే అయివుంటుంది.

మానస్, గాయత్రి గురించి సంక్షిప్తంగా పరిచయం చేసి వెళ్ళిపోయాడు. గాయత్రి అతనిమాట అందిపుచ్చుకుని, "నన్ను గురించి అడిగావుకదూ తపన్. నేనే చెపుతానుండు సంగతంతా! నన్నుగురించి చెప్పడానికి మీా అన్నయ్యకి అన్నిసంగతులూ తెలియవు. అందుకని నేనే చెప్పాలి. నా సంగతి నాకు తెలియదు. కాని, నీ సంగతి అంతా నాకు



గాయత్రి : "నన్నుగురించి అడిగావు
కదూ? నే నే చెప్తానుండు సంగతంతా"

తెలుసు. నీ పేరు తపన్; మీ నాన్నగారి పేరు ధూమకేతు బాబు. అవునా? నేను నీకు గాయత్రి అక్కయ్యను, సరేనా! ఇంకేం చెప్పమంటావో అడుగు."

"అయితే గాయత్రీదీ! బాగానే ఉంది. నీలాగ ఇంత వరకు ఎవరు మాటలాడినవారు నాకు కనుపించలేదు. మా అన్నయ్య క్లాస్ ఫ్రెండువా?" గాయత్రి "అరెబాబూ! అంత పెద్దక్లాసువరకు నేను చదువుకోలేదు. అంత విద్యరాదు నాకు. ఈ జీవితమంతా తిని కూర్చోవడం, తిరగడంతోటే సరిపోయింది. ఈవేళ నీతో కలిసికూర్చుని చదువుతాను

నీ పుస్తకాకాలూ అవీ. నీవు - 10 వ తరగతి అంటే యస్. యస్. యల్. సి. చదువుతున్నావుకదూ? నేనూ అదే క్లాసు. స్కూలుఫైనల్ పరీక్షకు ఈ సంవత్సరం వెళతావుకదూ? అందుచేత నేనూ మెట్రిక్ పరీక్షకు కట్టాను. అందుచేత నేను నీకు క్లాసుఫ్రెండ్‌నంటే బాగుంటుందికదూ?"

"నిజం అయితే బలే మజాగా వుంటుంది. గాయత్రక్కయ్యా! మన మిద్దరం కలిసి చదివితే భేషుగ్గా వుంటుంది. చూద్దాం - పోటీలుపడి. మనలో ఎవరు ఎక్కువసేపు చదువుతారో, ఎవరెక్కువసేపు మెలకువగా ఉంటామో!పరీక్షలయ్యేవరకు యిక్కడే వుంటారుగదా గాయత్రీదేవి?" అని తపన్ అడిగాడు. గాయత్రి నవ్వుతూ చెప్పింది. "ఎక్కడ వుండాలీ అనే చూస్తున్నాను. నీతో కలిసిమెలిసి చదవకపోతే, నాకీ పరీక్ష నీరీక్షా అన్యోటట్టుగాలేదు" అన్నది.

తపన్‌తోనేగాక, కొన్ని క్షణాలలో తపన్ తల్లి సత్యభామతో కూడ చనువుగా కలుపుగోరుతనం గాయత్రి చేసుకొన్నది. టీ తానే స్వయంగా చేసి యిచ్చింది. సత్యభామ డబ్బాలోంచి జంతికలు తీసింది. ఒకటి రెండు జంతికలు తినగానే సరిపోలేదు. గాయత్రి వద్దంటూనే ఉన్నా, ఆ మలుపులో దుకాణందగ్గరికి వెళ్ళి బంగాళాదుంపలూ, పూరీ పొంగడాలూ, కచోరీలు తెచ్చిపెట్టింది. అవి రెండుభాగాలు చేసి గాయత్రి ఇద్దరి అన్నదమ్ములకీ పెట్టింది. భోజనాలవీ అయిన తర్వాత గాయత్రి మానస్‌తో అన్నది:

"మానస్ బాబూ! నాకు మరేదో ఏర్పాటుచేయండి."

"ఏమి ఏర్పాటు?"

"ఆడవాళ్ళకి అనేకమైన హాస్టల్సు అవీ ఉంటాయట. మహిళా సభలు, భోజన వసతి గృహాలూ అవీ ఈ కలకత్తా పట్టణంలో ఎన్నో వుంటాయి. అందులో ఒకటేదైనా నాకు ఏర్పాటుచేయండి."

"అయితే, పరీక్షలయ్యేవరకు ఇక్కడే ఉంటారని అన్నట్టున్నారు."

"ఆ మాట తపస్‌తో ఊరికే అన్నాను. మీతో చెప్ప వలసింది ఏమిటి అంటే, నాకు ఏదయినా హాస్టలు ఏర్పాటు చేస్తే..."

"మీకా ఆలోచన ఎందుకు - మీరు తపూతో అన్నమాట బోటికానక్కరలేదు. పరీక్షలయ్యేవరకు ఇక్కడే ఉండవచ్చు."

"ఏమిటీ పిచ్చి మీకు? నేను చెప్పింది వినండి— సొంతంగా - ఏదో ఒకచోటుచూడండి? మీరు చూడకపోతే నేనే ఒంటరిగా బయలుదేరి ఏదో ఒకచోటు నిశ్చయం చేసుకొని రావాలేమిటి" మానస్‌కి గాయత్రి సంకల్పం అర్థ మయింది. ఆమె ఏమిచెయ్యాలి అని నిశ్చయం చేసుకుందో అలాగే చేసితీరుతుంది. అయితే గాయత్రిని యిక్కడ అట్టే పెట్టి ఉంచడంలోకూడ చిక్కులు లేకపోలేదు.

"ఏవిధంగా సంబంధంలేని ఒక స్త్రీని తెచ్చి చిరకాలం యింట్లో పెట్టుకుంటే కుటుంబంలో సంఘంలో ఎన్నో చిక్కులు వస్తాయి. ఎన్నో సమస్యలు బయిలుదేరతాయి. అవన్నీ తీర్చగలిగే శక్తి మానస్‌కి లేదు. కొంచెంసేపు ఆలో చించి ఆమెతో అన్నాడు.

"సరే అయితే, నేను ట్యూషన్ చెప్పడానికి బయటికి వెళ్తున్నాను. నాతోపాటు మీరుకూడా రండి. మా స్నేహితుడొకతను చెల్లెలు మాణిక్యతలాలో ఒక స్త్రీల హాస్టలు సూపరింటెండెంటుగా పనిచేస్తున్నది. ఆమెను కలుసుకొని సంప్రతించి, అక్కడ వాళ్ళ హాస్టలులో చేరడానికి వీలుంటుందేమో చూద్దాం. అక్కడ సీటు దొరుకుతుందో లేదో మరి. అయితే, ఆ హాస్టలులో సీటు దొరికితే, భోజనం వసతి అంతా కలిపి మంత్లీ ఛార్జెస్ నలభై రూపాయలకు తక్కువ కావు. ఆ మాత్రం మీరు కెలాగ భరించగలరు?"

గాయత్రి నవ్వుతూ బదులు చెప్పింది. ఎలాగ గడుపుకోవాలో అదీ మీరే యేర్పాటు చెయ్యాలి. ఒకటి రెండు మాసాలవరకు పరవాలేదనుకొంటాను. నా బ్యాగులో కొంత సొమ్ము ఉంది. చేతిమీద మెడలోను ఉన్న నగలు అమ్మిపారేసి, ఎంతవస్తే అంతటితో కొన్ని రోజులు గడపవచ్చు. తరవాత ఏదైనా చిన్న పనిలో ప్రవేశిస్తే దానితో చూచుకోవచ్చు. చదువుకోవడానికి తపూతో సహాధ్యాయిగా చేరడానికి అవకాశం లభిస్తుంది.

"అయితే, పదండి; చూద్దాం" అని మానస్ బయలుదేరాడు. గాయత్రి సూట్‌కేసు పట్టుకొని లేచింది. అది తిరిగి తీసి పట్టుకొని సత్యభామ అడ్డుకుంది: "నీ విక్కడనుంచి యెక్కడికి వెళ్తావు? వద్దు. నీ విక్కడనుంచి ఎక్కడికి వెళ్ళనక్కరలేదు."

గాయత్రి విస్మితురాలయింది. "అదేమిటి పిన్నిగారూ!" సత్యభామ గంభీర కంఠంతో పలికింది: "మధ్యాహ్నం భోజనంచేసి వెళ్ళుదువుకాని. మానస్ పనిమీద బయటకి వెళుతున్నాడు. వాడు నిన్ను వెంటబెట్టుకొని, అక్కడికీ ఇక్కడికి తిరిగితే ఏమి ప్రయోజనం. హాస్టలో, అనాథాశ్రమమో, అభయ నిలయమో ఏదోఒకటి నిశ్చయం చేసి వాడు ఏర్పాటుచేసి వస్తాడు. అలాగ చేసిన తర్వాత నువ్వెప్పుడు వెళ్ళవచ్చు."

మానస్ తల్లిమాటలు విని పెద్దకొడుకులాగ శిరసావహించాడు.

"సరే! అలాగేకానీ"అని అతడు బయటికి వెళ్తూంటే గాయత్రి అతనితో ఇలా అన్నది:

"ఈ ఊరిలో మా చుట్టాల ఇళ్ళు రెండు మూడు ఉన్నవి. అయితే నా కక్కడికి వెళ్ళాలని లేదు. వాళ్ళందరికీ నా కథ సొంతం తెలుసు. అందుకని వాళ్ళింటికి వెళ్ళి ఒకటి రెండు రోజులకోసం అక్కడ గడపాలనిలేదు. మీరు వుండమంటున్నారంటే ఆ విషయం వేరు. తరవాత ఇలాగే యేదైనా అనాథ ఆశ్రమంలో చేరాలనికూడ నాకు లేదు. భర్త, సంసారం, ఇల్లూవాకిలి విడిచి అనాథలాగు ఆశ్రమవాసంచేయడానికి నాకింకా ఆత్మాభిమానం బాధిస్తున్నది. ఒకవేళ ఏమీలేకపోయినప్పటికికూడ, రెండుచేతు లున్నాయి కదా! వీటిని ఉపయోగించి ఏమైనా పనిచేయలేకపోతానా? పొట్ట పోషించుకునే ఉపాధి చూచుకోలేకపోతానా?"



తపన్ : "నేను కాళికాదేవి ఆలయంలోకి వెళ్ళి
మొక్కుకొని వచ్చానమ్మ గాయత్రక్కయ్యా."

ఒక్కక్షణం మానస్ ఆమెవైపు దీర్ఘంగా దృష్టిపెట్టి చూచాడు. ఆమె మాటలకి ఏమీ బదులు చెప్పకుండానే, త్వరత్వరగా అక్కడనుంచి వెలుపలికి వెళ్ళిపోయాడు.

కొన్ని క్షణాలు గడిచేటప్పటికి గాయత్రి చిరునవ్వు ముఖంతో ఆ యింటి పనులలో ప్రవేశించింది. చకచక లాడుతూ సత్యభామ ఆమెకు వంటింట్లో కూరలు తరిగి ఇస్తున్నది. తపన్ ఈ లోపున బజారుకెళ్ళి ఏవో కూరలూ అవీ తెచ్చాడు. గాయత్రిని చూచి సంతోషంతో తపన్ "నేను బజారుకెళ్ళి వచ్చే త్రోవలో కాళికాదేవి ఆలయంలోకి

వెళ్ళి మ్రొక్కుకొని వచ్చానమ్మా - గాయత్రక్కయ్యా !"
అన్నాడు.

"ఏమని మొక్కుకున్నావట- చెప్పు చూద్దాం !" అని
గాయత్రి అడిగింది.

"నీకు హాస్టలు ఖుష్టులు ఏమీ లేకుండా చేస్తే. కాళీ
మాతకు కొబ్బరికాయ కొట్టానని చెప్పి వచ్చాను."

అది విని గాయత్రి నవ్వుతూ అంది:"అదా నాయనా!
నీ మనసులో ఉద్దేశం - నే నిక్కడే ఉండిపోవాలనా ?"

సత్యభామ అది వినిపించుకోకుండా "ఆ కూరలవీ తర
గడం. యీ కష్టమంతా నీ కెందుకు ?" అన్నది.

"ఇంటిపనులు చేసుకోవడం, ఏ ఆడపిల్లలకయినా
ఏమి కష్టం పిన్నీ! నాకేమీ కష్టంకాదు. నేను రాగానే
నా సంగతంతా విని ఇదేదో నవనాగరిక పిల్ల అనుకున్నా
వేమో !"

"అదేంకాదు అమ్మాయి ! నాగరికమూకాదు, భోగ
రికమూ కాదు. సీత, సావిత్రీ వంటి పతివ్రతలు జన్మించిన
ఈ దేశంలో మీలాంటి ఆడవాళ్ళు ఎలాగ నెగ్గుకొని
రాగలరని !"

గాయత్రి కొంచెం సంశయించి, తరవాత చెప్పింది
మెల్లగా :

"పిన్నిగారూ ! నా జీవితంలో ఏదైనా యోగం
పట్టితే, ఎప్పుడో ఒకప్పుడు వచ్చి, మీ ప్రశ్నకు తగిన సమా
ధానమివ్వగలనేమో !"

రెండు గంటలు దాటిన తరవాత మానస్ తిరిగి వచ్చాడు. అన్ని యేర్పాట్లూ అతడు సరిగానే చేశాడు.

# 5

మానసబాబు తిరిగివచ్చి "ఏర్పాట్లు అన్నీ చేశానమ్మా" అని చెప్పగానే సత్యభామ — "ఏమి యేర్పాట్లు చేశావో నాకు కొంచెం చెప్పు నాయనా" అని అడిగింది. మానసబాబు "అదేనమ్మా! మాణిక్తలాలోని నా మిత్రుని చెల్లెలు హాస్టలు సూపరిండెంటుగా పనిచేస్తున్నదని అన్నానే, ఆవిడే అరుణాదేవి. ఆమె పేరు చెప్పగానే స్త్రీల హాస్టలులో సీటు దొరికింది. ఇదేమిటి, ఏడాది మధ్యలో సమయం కానప్పుడు వచ్చి సీటు అడిగితే యెలాగ వస్తుందని కొంత సణుగుపాటు అదీ జరిగిందనుకో! కొంచెం ప్రయత్నం చేస్తే ఒక్క సీటు దొరకకపోతుందా?"

ఇదంతా వంటిల్లుముందు తచ్చాడుతూ చెప్తున్నాడు మానస్. గాయత్రి కూడ సత్యభామ దగ్గరే కూర్చొనిఉంది. అప్పటికే స్నానంచేసి సిద్ధంగావుంది. మామూలురకం మిల్లుచీర కట్టుకుంది. సుదీర్ఘమైన కేశరాశి సంస్కారంలేక అలాగే పడివున్నది. ఆమె దువ్వుకొనే ప్రయత్నం చేయక, ముందు పాపిటతీసుకొని అలాగే జారుముడి వేసుకుంది. ఆమె జీవితంలో ఎన్ని కష్టాలో భరించింది. అయితే ప్రకృతి సౌందర్యం విషయంలో ఆమె జన్మ లగ్న ప్రభావం ఏమిటో

కాని సామాన్యంగా అలంకరించుకున్నాగాని అపరూప సౌందర్యవతిలాగు తయారై ఊరుకుంటుంది.

ఆ మాటలు చెప్పి, మానస్ మరొకవైపు తిరిగిపో తున్నాడు.

గాయత్రి అడిగింది - "ఏర్పాటు చేశారు సరే! కాని ఎంత సొమ్ము తీసుకుంటాగో చెప్పలేదే?" ఈ ప్రశ్నకు బదులు చెప్పకుండానే సత్యభామ అందుకుంది. "అది బాగానే ఉంది కాని మానస్! నువ్వు ట్యూషన్‌కి ఎప్పుడు వెళ్లావు? మాణిక తలాలోని హాస్టలుకి వెళ్ళడం ఎలా కుదిరింది? ఇదంతా మాయకబుర్లలాగున్నది." మానస బాబు భ్రూనిక్షేపంచేసి గంభీరముఖంతో చిరునవ్వు నవ్వుతూ దానికి బదులు చెప్పాడు: "అవునమ్మా - అది కొంచెం కష్టమే. నీ కన్నులబట్టిచూస్తే యీ ఏర్పాటు నీకు నచ్చినట్టు లేదు; దీనికి కంట తడిపెట్టుకుంటా వెందు కమ్మా?"

సత్యభామ - "నచ్చడమా! నచ్చకుండానే - వెళ్ళి పోతా నంటున్నావు. ఈ యమ్మాయిని తీసికొనిపోతా నంటున్నావు - ఎక్కడికి? - ఈ కలకత్తా మహాపట్టణంలో - మీా యిద్దరినీ ఇంతవాళ్ళుగా చేయడానికి సిరిసింధూరంలేనిదే నే నెంతగా కష్టపడ్డానో నీ కేం తెలుస్తుంది? పిల్లలుగన్నతల్లి బెంగ ఇంకెవరు కనిపెట్టగలరు? ఈ అమ్మాయిసంగతి చూస్తూ ఉంటే కళ్ళు చెమ్మగిల్లాయి; నా కళ్ళల్లో దుమ్ముకొట్టి పోతానంటావేమిటి?"

అయితే నిజం చెప్తా విను - ప్రొద్దున్న ట్యూషన్‌కి వెళ్ళడానికి కుదుర లేదు. ఈ ఏర్పాటు పూర్తిచేయడంలో ఒక క్షణం కూడ ఆలస్యంచేయలేదు. ఇంతలో నాకు స్కూలుకు టైముఅయిపోయింది. వచ్చేశాను."

గాయత్రి అడిగింది : "ఇంతకీ వాళ్ళెంత చార్జి చేస్తారో చెప్పలేదు." మానస్ : "వాళ్ళని ఎలాగో కొంత తగ్గించమని కోరాను. ఎంతో కన్సెషన్ చూపిస్తే, నలభై రూపాయలు అవుతుందట! అంతకంటె తగ్గడం కుదరదట."

సత్యభామ అందుకొని "నలభై రూపాయలే! నలభై రూపాయలు ఎక్కడనుంచి తెస్తుంది!"

మానస్ - ఉన్నదాంట్లోనే అని సమాధానం చెప్ప బోతూవుంటే, గాయత్రి మాట కలుపుకొని "ఏదో ఒకటి రెండు మాసాలు నేను యెలాగో గడుపుకొని వస్తానులెండి పిన్నిగారూ! దాని తర్వాత మరి ఇంకేదైనా యేర్పాటు చేసుకోవచ్చును."

సత్యభామ తీక్షణంగా గాయత్రికేసి చూచింది. ఆమె చేతులకున్న రెండు గాజులూ లేకపోవడం గమనిం చింది; వెంటనే ముఖం త్రిప్పుకొని వంటఇంటిలోకి వెళ్ళి పోతూ తనలో సణుగుకొంటున్నది. "నాకేమీ బోధ పడడం లేదు నాయనా! ఇదేమి యేర్పాటు చేశావో?" అని వంటింటివైపు వెళ్ళింది. ఇంతలో మానస్‌బాబు, గాయత్రి లేచి బయటికి వెళ్ళడానికి సన్నద్ధంఅవుతున్నారు.

అంతవరకు గాయత్రి వెళ్ళిపోవాలనే కోరుతున్న సత్యభామ మనస్సులో ఏమి మారిందో కాని, ఇప్పుడు గాయత్రి వాళ్ళ ఇంటినుండి వదలి వెళ్ళిపోవడానికి ఆమె ఇచ్ఛగించు తూన్నట్టు కనిపించడంలేదు. ఆమె మనస్ఫూర్తిగా గాయత్రి వెళ్ళిపోవాలని కోరడంలేదు.

ఇంతలో నగుకుస్తూ తపన్ ప్రవేశించాడు. గాయత్రి వాళ్ళ ఇంటిదగ్గరనుంచి వెళ్ళిపోకూడదని ఏ దేవతలకు మొక్కుకొని ఎక్కడ ఏ గుడిలో కొబ్బరికాయలు కొట్టా లనుకొన్నాడో - ఏమీ లాభించలేదు. రెండు గంటలు దాటకుండానే - తపన్ ఆనందం అంతా ఫుల్‌స్టాప్ !

ఇలాంటి వేళలో - ఎన్నడూ ఇంటిపట్టున ఉండి యెరు గని తపన్ యీవేళ ఇంట్లో ఉన్నాడు. స్కూలుకి వెళ్ళే హడావిడి లేదు. ప్రొద్దున్నే చదువు పూర్తిచేసుకొని, బజా రుకు పోయి కూరలను తెచ్చిపారేసి ఎదురుగాఉండే మిత్తర్ బాబుగారి ఇంట్లో పిల్లలతో బ్యాట్‌మింటన్ ఆడుకొంటూ పదకొండు గంటలవరకు కాలక్షేపంచేసేవాడు. ఈవేళ బజారుకెళ్ళి రావడం తప్ప ఒక పావుగంటకూడ ఇల్లువదలి పోలేదు. గాయత్రిదగ్గరే ప్రక్క ప్రక్కగా ఉంటున్నాడు. గాయత్రితప్ప అతనికి - ఆడవాళ్ళతో మాటలాడటం అల వాటు లేదు. భవానీపూర్‌లో వాళ్ళ మామ ఉన్నాడు. వాళ్ళ ఇంటికి అప్పుడప్పుడు వెళ్ళి, అక్కడ అత్తయ్యతోటీ, వాళ్ళ చెల్లెలుతోటీ కుశలప్రశ్నలు అడిగి వస్తూఉంటాడు. ఈవేళ - ఒక వింత అనుభవం అతనికి కలిగింది. అతని కిశోర

హృదయంలో - తనతో మాటలాడే ఒక అమ్మాయి దొరి కిందికదా అనే సంతోషం కలిగింది. ఇదివరకు తనను పలక రించిన ఆడవాళ్ళు, అక్కలూ, చెల్లెళ్ళు, అత్తలూ, అమ్మలూ తప్ప, తన మంచిచెడ్డలు, తన మధురస్వప్నాలు, తన కష్ట సుఖాలు, తన తెలివితేటలూ తెలిసికొని ప్రోత్సాహం ఇచ్చే వారు లేకపోయారు. ఇదంతా గాయత్రివల్ల సాధ్యమయింది. చిన్నతనపు ఊహలకి ఒక స్వరూపమిచ్చి ధైర్యం కూర్చింది గాయత్రి. ఒక సంతోషం ఒక ఆనందం అన్నిటికంటే ఎక్కు-వగా గాయత్రి తనతోపాటు చదువుకొనబోయే సహాధ్యా యిని. తపన్ వైపు చూచి గాయత్రి కొంచెం వెనుకంజవేసినట్టు య్యింది. తపూ ముఖం త్రిప్పివేసుకున్నాడు. అలాగే వెళ్ళి పోయాడు. గాయత్రి పిలిచింది:

"తపూ! యిలాగ రా? నీతో ఒక మాటచెప్పాలి."

"గాయత్రక్కయ్యా - నీవు వెళ్ళిపోతున్నావుగా— ఇంకేం మాటలాడతాను" అని తపన్ అన్న మాటలుగాయత్రి మనస్సు దేవేసినట్టయినాయి. ఆమె జీవితంలో ఎవ్వరూ యింతటి అభిమానంతో - కట్టివేయలేదు. స్వచ్ఛంద ప్రేమ లోని ఈ మాధుర్యం చవిచూచి ఆమె హృదయం టక్ టక్ కొట్టుకున్నట్టయింది. ఆమె లోపలిహాంగు దిగమింగుకొని తపన్‌తో చెప్పింది.

"తపన్, చూడు నాయనా! నే నిక్కడ చాల రోజు లుందామని రాలేదు. మీ అన్నయ్య దయవల్ల ఒక్కరాత్రి ఆశ్రయంకోరి ఇక్కడ తల దాచుకొందామని వచ్చాను. అయిపోయింది. ఇప్పుడు హాస్టలులో ఏదో ఏర్పాటుచేశాను.

లేకపోతే ఎటువంటి ఆపదలో పడవలసివచ్చేదో భగవంతుడికే తెలియాలి. నేను వెళ్ళినా, హాస్టలుకేకదా వెళ్ళేది. అక్కడే ఉంటాను, నీవెప్పుడువచ్చి చూచినా చూడవచ్చు. ఏమంటావు తపన్?"

"అది ఆడవాళ్ళ హాస్టల్. మగవాళ్ళను ఎందుకు రానిస్తారు?"

"ఆడవాళ్ళ హాస్టలయితేనేం - అక్కడ పిల్లల అన్న తమ్ములు వస్తే ఎందుకు చూడనివ్వరు?"

తపన్ ముఖం సహజ బాధతో వివర్ణమైపోయింది. ఒక్క క్షణంలో అతని ముఖంలో గంభీరత ప్రవేశించింది. అక్కడవంటింట్లో తప్పేళాలూ గరిటెలూ చేస్తున్న రణగొణ ధ్వనులుచూస్తూ ఉంటే సత్యభామ మనస్సుకూడ శాంతంగా ఉన్నట్టు అనిపించడంలేదు. ఆమె కంఠం ఉచ్ఛస్థాయిలో పలుకుతోంది.

"ఏమిటో యిదంతా, అసలెందుకు తీసుకొనిరావాలి. తిరిగి యెందుకు వెళ్ళిపోవాలి. ఈ యెడబాటు, ఈ వెళ్ళొస్తాను అనడాలూ ఇవన్నీ యేమిటి? ఈ కాలం చదువుకొన్న వాళ్ళు ఎవరికివారు స్వతంత్రులైపోయారు. ఏమేమో తమ యిష్టంవచ్చినట్లు చేస్తున్నారు."

మానస్‌బాబు యింతలో స్నానం పూర్తిచేశాడు. తల దువ్వుకొంటూ దువ్వుకొంటూ ఆ వంటింటి వరండాలో ప్రవేశించి అన్నాడు.



"ఏమిటమ్మా! నీవు విచిత్రమైన మనిషివిలాగున్నావు. ముందు రాగానే ఇదేమిట్రా - యెవరో యే కులం పిల్లనో యిక్కడికి తీసుకొచ్చావు అని సాధించి క్షణంతోచనీయకుండా చేశావు. ఇక్కడ ఉండడానికి ఎంతమాత్రం ఒప్పుకోలేదు. ఇప్పుడు వెళ్ళిపోతుంటే - యిలాగ సాధిస్తున్నావు మళ్ళీ."

"సాధిస్తున్నానా! అది కాదురా? ఎలాగో తీసికొచ్చి పెట్టావు సరే, ఇదేదైనా పెట్టెట్రాంకూ అనుకున్నావా! చెట్టు చేమ అనుకున్నావా! ఒక వ్యక్తురాలైన యిల్లాలు. ప్రాణం లేని పెట్టెబేడ కాదు. ఆమెకు హృదయం వుంది, మనస్సు ఉంది. ఒక వస్తువును తెచ్చి, తిరిగి పట్టుకొనిపోతున్నట్టు మాటలాడుతున్నావు. తెచ్చిపెట్టడం అంటే సులువుకాని,

తిరిగి తీసుకొనిపోవడం అంత సులువుకాదు. ఆమెకు ఇంగితం వుంది, చరిత్ర వుంది. ఆడదాని మనస్సు నీ కేమి అర్థంఅవుతుందిరా నాయనా! వచ్చింది, వెళ్తుంది అని సులువుగా అనేశావు."

మానస్ తెల్లబోయాడు. తల్లి యీలా గంటుందని ఎన్నడూ తలపోయలేదు. సత్యభామ మరింతతీవ్రంగా మొదలు పెట్టింది.

"ఆమె అంటే నా కేమిటి పట్టింపు! నా కేమవుతుంది. ఏమీ కాదు. బయట చూడగానే పలకరించావు; మాటలాడావు; అనుబంధం పెంచావు. మాటలాడావు, పరామర్శ చేశావు. మధ్యలో తీసుకొనిపోతానంటే ఎలాగ వచ్చేది? నీవేదో స్నేహబంధం కలిపావు, ఇప్పుడు తీసికొనిపోతానంటే నా కేదో బెంగగా వుందిరా."

మానస్: ఇదంతా యేమిటమ్మా? మాటలు కలవడం స్నేహబంధం, బెంగ ఇవన్నీ అంటున్నావు.

సత్యభామ: అవునురా నాయనా! నీ కివన్నీ యెలాగ తెలుస్తాయి?

ఇలాగ మాటలు చెపుతూనే ఆమె వడ్డన చేస్తున్నది. మానస్‌కి ఇదంతా చిత్రంగా కనిపించింది.

"చూడు అమ్మా! నీవు చెప్పేది నాకు సరిగా బోధపడడంలేదు, నీ వుద్దేశం ఏమిటో – ఇంతకీ – ముందు అన్నం పెట్టు అన్నం."

సత్యభామ: ఒక కంచంలో అన్నం వడ్డించి అతనికి అందిచ్చింది.

మానస్: "అమ్మా! ఆమెకు అన్నం వడ్డించవూ? ఆమెకూడ భోజనం ఇప్పుడే చేస్తుందేమో?"

సత్యభామ గంభీరంగా అనేసింది, "ఏమిట్రా నీ ఉద్దేశం, ఆ అమ్మాయి ఎక్కడికి పోతుంది? పదిగంటలయింది. నీవేమో స్కూలుకుపోతావు? ఆ అమ్మాయిని నీవు కూడ తీసుకుని వెళ్ళాలికదా? స్కూలునుంచి తిరిగి వచ్చినతర్వాత తీసికెళుదువుగాని." మానస్ ఇంక దానినిగురించి మాటలాడ టానికి టయిమ్‌లేదు. ఒక క్షణంలో భోజనం అందుకొని అమ్మకేసి చూస్తూ అది పూర్తిచేసి స్కూలుకి బయలు దేరాడు. వెళ్ళేటప్పుడుమాత్రం అత్యంత కరుణాభావంతో గాయత్రికేసి చూసి ఆమెతో ఇలా అన్నాడు:

"చూడు గాయత్రీ! యింక వ్యవహారమంతా నా చేయి జారిపోయింది. జరగవలసినదేమో అమ్మతో మాట లాడి సంప్రతించి నిశ్చయించేసుకో. నేను వెళ్ళొస్తాను మరి" అలాగని మానస్ వెళ్ళిపోయాడు. తపన నవ్వుతూనవ్వుతూ అన్నాడు. "బాగాఅయింది గాయత్రక్కయ్యా! పద, అమ్మతో ఆలోచించుకువు కాని."

ఆమెదగ్గరకే వెళ్ళింది గాయత్రి. సత్యభామ చిన్న అబ్బాయి తపన్‌కోసం, ఒక కంచంలో అన్నం వడ్డించింది. గాయత్రి ఆమెను అడిగింది:

"పిన్నిగారూ! మీరు మనస్సులో ఏమని ఆలోచిస్తు న్నారో నాకేమీ తెలియడంలేదు – కాని"

"కాని? ఏమిటి సంశయస్తున్నావు"

"నేనంటే మీకు..."



గాయత్రి: "పిన్నిగారూ! మీరు
మనస్సులో ఏమని ఆలోచిస్తు
న్నారో నాకేమీ తెలియడంలేదు. కాని...."

"అవును తల్లీ, నీ నంటే నేను మొదట్లో చెడ్డగానే భావించాను. ఇప్పుడు మంచిదానివిగానే కనిపిస్తున్నావు. ఏమయితే యేమిటి, ఇక్కడనుంచి వెళ్ళిపోతానంటున్నావు కదా! చూడు అమ్మాయి, ఈ విషయం వెళ్ళినా ఉన్నా నీ యిష్టం. మా కాలంలో ఆడవాళ్ళు వెళ్ళడానికి పోవడానికి వాళ్ళ యిష్టంఉండేదికాదు. మనూ నిన్ను తీసికొచ్చి వదిలి పెట్టివెళ్ళితే నే నెందుకు రానిచ్చి ఉండనిచ్చాను. హాస్టలులోకి వెళ్ళి ఉండాలీ అంటే వుండవచ్చు. అది నీయిష్టం. అయితే యింటిలోవుండే సౌకర్యాలు - ఆడపిల్లలకి హాస్టలులో ఎలాగు కుదురుతాయో ఏమిటో నాకు తెలియవు. వంచేస్తావో నీ యిష్టం."

ఈ విచిత్రమయిన సత్యభామ మాటలు విని క్షణ మాత్రం నిశ్శబ్దతలో మునిగిపోయింది గాయత్రి. తిరిగి ఏదో సంశయంగా చెప్పబోయింది - "అయితే రాత్రి మీరు మానస్ బాబుతో అన్న మాటలన్నీ వింటూవుంటే - పిన్ని గారూ! మరోలాగ అనిపించింది."

సత్యభామ: "నేను మానసబాబుతో రాత్రి అన్న మాటలకేం? అందులో తప్పేమీ లేదే? ఎదిగిన కొడుకుతో ఏ తల్లి అయినా అలాగే అంటుంది. రాత్రివేళ ముక్కు మొగంఎరగని అమ్మాయిని ఎవరినో తీసికొచ్చి ఇంట్లో పెట్టితే ఏతల్లి ఊరుకోగల్గుతుంది! ఆ తల్లివి నీవు అయినా, మీ అబ్బాయితో, అలాగ అనేదానివి. తల్లి ప్రాణం తల్లడిల్లక తీరుతుందా? ఏమైనా మనూ మా అబ్బాయి. వాడేం చేసినా ఎవరిని తెచ్చినా నా బాధ్యతేకదా? దాని గురించి నీవు నిరుత్సాహపడనక్కరలేదు. వాడు పెట్టుకొన్న భారం నాది కాకపోతుందా? నీవు కులం తక్కువనీ, అదనీ ఏమీ అనుకో వద్దు."

గాయత్రి: "అయితే, పిన్నిగారూ! నేను మీ ఇంట్లో ఉండడానికి ఏమి అధికారం ఉంది?"

సత్య: "నిన్నరాత్రి మొదలు యిప్పటివరకు ఏ అధికారం ఉందో అదే అధికారం. ఇక్కడ వుంటావు. చదువు కొంటావు. పరీక్ష ప్యాసవుతావు. తర్వాత ఏదైనా ఉద్యోగం చూచుకొని వెళ్ళిపోతావు."

గాయత్రి కన్నులలో నీరు నిండిపోయింది. ఏదో చెప్పబోయింది.

"మీ జాతిగౌరవం తగ్గించే కులభేదంమాట ఏం చేస్తారు పిన్నిగారూ!"

సత్య: అదంతా నాకు వదిలిపెట్టు. నా మీద భారం వెయ్యి. ఇంతకీ నీ కింతకంటే నే చెప్పవలసినదానిని కాదు. పైన నీ యిష్టం; నీతో హెచ్చు వాదించలేను బాబూ!"

తపన్ ఇదంతా వింటున్నాడు. విని ఒక్కసారి సంతోషంతో చప్పట్లు కొట్టాడు. "జయ్ మహాకాళీ! నే నిప్పుడే నీకు కొబ్బరికాయ కొట్టాను" అని గంతు వేశాడు.

సాయంకాలం స్కూలునుంచి తిరిగివచ్చేటప్పటికి మానసబాబుకి ఆశ్చర్యం వేసింది. వరండాలో తల్లి కూర్చుండి ఉంది. గాయత్రి పొయ్యిమీద నీళ్ళుపెట్టి మరగిస్తున్నది. తపూ గాయత్రితో ఏవేవో కబుర్లు చెప్పివేస్తున్నాడు. మానస్ తల్లిని పలకరించాడు: "ఇదేమిటమ్మా! గాయత్రికి ఇంతలోనే వంటయింటి ఛార్జి అప్పగించావేమిటి?"

సత్యభామ: "నా మాట వింటేనా? వద్దంటున్నా వంటింట్లోకి దిగితే నే నేం చెయ్యను?"

గాయత్రి ముఖం తిప్పకుండానే బదులుచెప్పింది - "మీ జాతిగౌరవానికి మడికి భంగం కలుగుతుందనా"

మానస్: "జాతి గౌరవానికీ, మడికీ ఏం భంగం వచ్చిందిలే కాని, గాయత్రి ఒక్కర్తె యిలాగ వంటింటి బాధ్యత వహిస్తే - తన చదువు, పరీక్ష..."

సత్యభామ: "అదేమిట్రా అబ్బాయి అలాగంటావు? గృహస్థురాలయిన ఆడపిల్ల అయిన తర్వాత అన్నీ చెయ్యాలి. వీధిలో ముఖం పెట్టి చదువుకొంటే ప్రయోజనంలేదు. వంట పనులు ఇంటిపనులు అన్నీ చేసుకోవాలి మరి. ఆ మాటకేం గాని, నీవు కాళ్లూ చేతులూ కడుగుకొని రా!"

మానస్ తిరిగి ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

"అమ్మా! దీనికి అర్థం ఏమిటో? ఇంతకీ నీ ఉద్దేశం? గాయత్రి మనింట్లో యీ విధంగా..."

"ఈవిధంగానూ లేదు ఏవిధంగానూ లేదు. నీవు చెప్పిన అరుణాదేవిగారి హాస్టలుజీవితంకంటె చెడిపోయిందా మన యిల్లు?"

తల్లి మాటలలో అర్థం గ్రహించగానే మానస్ బాబుకి ఎంతో ఆనందం కలిగింది.

అతని కెన్నడూ యిలాంటి ఆనందం కలగలేదు. ఆ ఆనంద పారవశ్యంలో మాట రాలేదు. తొందరగా తడ బడుతూ లోపలికి వెళ్ళిపోయాడు. తిరిగి వచ్చి - ఆలోచించి తల్లిని మెల్లగా అడిగాడు — "అమ్మా! అది సరేకాని, భవానీపూర్‌లో మామయ్య వాళ్లు ఏమంటారో ఆలోచించావా?"

సత్యభామ: "ఆలోచించాను. మామయ్య మనల్ని కులంతక్కువవని చేశాము అంటాడు. కాని ఒక స్త్రీ జీవితంలో కృతకృత్యురాలవ్వడం హర్షించకపోతాడా?"

గాయత్రి యీ యింట్లోనే ఉండిపోవాలనే నిశ్చయం యిలాగ జరిగింది. దానితో ఆమె ఆ సంసారంలో కలిసి

పోయింది. వారి కుటుంబ జీవనంలో ఏమార్పూ లేదు. మానస్ ఎప్పటిలాగ రెండు పూటలా ట్యూషన్లు చెప్తున్నాడు. మధ్యాహ్నం స్కూలుకి వెళ్తున్నాడు. సత్యభామ తనకి తోచినపుడు పని చేస్తుంది, లేకపోతే లేదు. తపూ— ఆటలవీ ఆడుకొని వచ్చి గాయత్రితో ఏవో కబుర్లు చెప్పి కాలక్షేపంచేస్తూ వుంటాడు.

ఈ యిద్దరు అన్నదమ్ములు-తల్లివద్ద యింతవరకు పొందలేని ఒక అనిర్వచనీయమైన ఆదరణ యీ క్రొత్తఆవిడ వల్ల పొందగలుగుతున్నారు. వాళ్ళకి జీవితంలో ఒక క్రొత్త వెలుగు కన్పించింది.

మానస్ అన్నట్టే అయింది. భవానీపూర్ మామయ్యకి గాయత్రి వ్యవహారం ఏమీ నచ్చలేదు. ఆనోట, యీనోట అతడేమో అన్నట్టు నీలివార్తలు వస్తున్నాయి. సత్యభామ మాత్రం ఏమీ చలించలేదు. ఎప్పటిలాగే— గాయత్రిని కంటికి రెప్పలాగ చూచుకొంటున్నది. పరీక్షకు చదువు పట్టుదలగా సాగుతున్నది.

గాయత్రీ, తపూ యిద్దరు కలిసి, తెల్లారుజామునే లేచి చదువుతున్నారు. వాళ్ళిద్దర్నీ కనిపెట్టి చూడడానికి మానస్‌కి టైమ్ దొరకడంలేదు. మానస్ తన పని తాను చూచుకొంటున్నాడు. వీళ్ళిద్దరినీ విద్యార్థులుగామాత్రం భావిస్తున్నాడు. రోజూ ఆలస్యంగా వస్తున్నాడు. ట్యూషన్‌వద్ద ఆలస్యమయిందనీ, లైబ్రరీకి వెళ్లాలనీ ఏవేవో అంటున్నాడు.

ఒకరోజు మానస్‌తో గాయత్రి మాటలాడాలని పిలిచింది.

"మానసబాబూ, మీతో ఒక సంగతి చెప్పాలి."

"చెప్పు గాయత్రీ, ఏమిటి మాట ?"

"పిన్నిగారితో ఎలాగో చెప్పి ఏమార్చుతున్నారు కాని - అసలు సంగతి నాతో చెప్పండి. మీకు కొత్త ట్యూషన్ తీసుకొన్నారని ఇంత రాత్రయిందంటున్నా రా ? నిజంగా నాకోసం ఇలాగంటున్నారా ? మీ రేదో దాస్తు న్నారు !"

"ఏమీ దాచడంలేదే ?"

"లేదు, మీరు అబద్ధం చెప్తున్నారు. నే నిక్కడ ఉండడం ఏదో గళగ్రహం తెచ్చిపెట్టుకొన్నట్టుంది, అవునా?"

"గళగ్రహం ఏమిటి ? ఛా ! అదేమీ లేదు."

"లేదు - మీ కేదో చెప్పరాని ఆవేదనగా ఉంది. అవునా ? దయచేసి, మీ రింకోలాగ అనకుండా, డబ్బు కేదైనా లోటువస్తే ఇది మార్చి ఏమైనా కొంత సొమ్ము తెండి." అని గాయత్రి తన చేతి గాజులజత తీసి యివ్వ బోయింది. మానస్ ఆమెను వారించి "అలాంటిదేమీ చేయవద్దు. గాజులు తీయడం ఎందుకు ? గాయత్రీ-చూడు మీకు కొంచెం బాధగానే ఉంటుంది. కానీ నాకు కూడా గౌరవ ప్రతిష్టలు పోకుండా కాపాడుకోవలసి యున్నది. నా సంగతి కొంచెం ఈ దృష్ట్యా భావించుకో."

గాయత్రి:— "చూడండి, మీ రిలాగ ఎంతకాలం కష్టపడతారు ? చివరికి ఇలాగ రెక్కలు ముక్కలు చేసుకొని పనిచేస్తే ఏమైనా మంచంపట్టవలసివస్తే యెలాగ !"

మానస్:— మరేం భయంలేదు - మనిషి అయిన తర్వాత కాలు చెయ్యి విరిగి అస్వస్థతరాకుండా ఉంటుందా? దానికేం పర్వాలేదు. మీరు ముందు శ్రద్ధగా చదివి పరీక్షకు ప్యాసుచెయ్యండి: వచ్చేవారం పరీక్షలు. ఈ లోపున- ఈ గొడవలేవీ పెట్టుకోవద్దు."

గాయత్రి అతనికేసి దృష్టి నిలపలేకపోయింది. కన్నులు నీరుతో నిండిపోయాయి. "మానసబాబూ! నా జీవితంలో ఎన్నడూ ఒకరుచేసిన మంచికి కృతజ్ఞత ప్రకటించుకునే అవకాశం కలగలేదు. నేను ఇలాగ ఉండడం ఎంతో లజ్జగా ఉంది. నా కేలోపం రానీయకుండా మీ రెంతో గౌరవంగా చూస్తున్న సంగతి నాకు తెలుసు.

మానస్:—"జీవితంలో ఇచ్చి పుచ్చుకోవడానికి మన చేతిలో ఏముంది. అంతా ఆ పైనించి రావలసింది. అది లేకపోతే మన మధ్య యీ పరిచయమే ఏర్పడేది కాదేమో."

గాయత్రి పులకితురాలయింది. పరిచయము, స్నేహభావన కలగగానే ఇటువంటిది జీవితంలో ఎన్నడూ పొందని అనుభవం కలిగింది.

పరీక్షలు ప్రారంభమయ్యాయి. వారిద్దరు ఎంతో శ్రద్ధతో, ఎంతో కష్టపడి చదివారు. వ్రాశారు. ఇంక ఫలితాలు తెలియాలి. ఇంతలో మానసబాబుకి జబ్బుచేసింది. మంచంపట్టాడు. సత్యభామ హడావిడి చేస్తుంది; ఇంటి పెత్తనం చేస్తుంది కాని, కొడుకు జబ్బుపడితే ఏంచేయగలదు? ఆమెచేత కాలేదు. గాయత్రి రాత్రింబవళ్ళు ఆ మంచందగ్గర ఉండి మానస్‌కి అన్ని సపర్యలూ చేస్తున్నది. మానస్‌కి

ఎటువంటి ఘర్షణ జరిగి, అతనికి చెడ్డపేరు వస్తుందో అని ఆమె భయం. చేతిగాజులు తీయడానికి అప్పుడు మానస్ ఇష్టపడలేదు. కాని అవి తీయక తప్పలేదు. అవి మంచినీళ్లు లాగ వ్యయం అయిపోయాయి కూడ ఈ జబ్బులో. అతనికి తెలియలేదు.

రెండు మాసాలు గడిచాయి. మానస్ ఆరోగ్యం కోలుకొన్నాడు. తపన్, గాయత్రీ ఇద్దరూ పరీక్ష ప్యాసయి నట్టు శుభవార్త తెలిసింది. తపన్ — మెల్లగావచ్చి అన్న కాళ్ళకు దణ్ణంపెట్టాడు.

మానస్:—ఏమిరా తపూ!

తపన్:—ప్యాసయ్యాను అన్నయ్యా!

గాయత్రి తలవాల్చి ఉన్నది.

మానస్:—మరి నీమాటో గాయత్రీ?

గాయత్రి - రెండుచేతులూ మానసబాబు పాదాల వైపు వెళ్ళి ముట్టుకొన్నాయి.

సత్యభామ- ఆనందం పట్టలేకపోయింది. ఆమెకన్నులు ఆనంద బాష్పాలతో నిండిపోయాయి.

అదే సమయంలో- ఎవరో తలుపు తట్టి పిలుస్తున్నారు.

"మానసబాబు ఉన్నారా!"

తపూ వెళ్లి తలుపు తీశాడు. వెంటనే ఒక పెద్దమనిషి ఇంట్లో ప్రవేశించాడు. మానస్, గాయత్రి అటు చూచారు. అతడు దీనంగా, జాలిగొల్పుతూవున్న మనిషి నిమాయ్ - గాయత్రి పూర్వభర్త—నిమాయ్ చక్రవర్తి. "మానస్



నిమాయ్ : "మానస్‌బాబూ! మరొకలాగా
అనుకోకండి. నేను ......."

బాబూ! మరొకలాగ అనుకోకండి! ఇన్నాళ్లు నేను రావడానికి సాహసించలేకపోయాను. ఈసారి రాకుండా ఉండలేకపోయాను. చూడు గాయత్రీ! నిమాయ్ నీ యెడల చేసిన పాపానికి తగిన పరిష్కారం జరగాలి. ఆ పాపఫలం అనుభవించకుండా, అవన్నీ వినిపించకుండా, నేను చావలేను."

ఈ సమయంలో గాయత్రి చేతులు మానసబాబు చేతులమీద పడియున్నవి.

# 6

నిమాయ్ చక్రవర్తి అలాగ ఆకస్మికంగా వచ్చి ఆవిర్భవించి, పశ్చాత్తాపంపడినట్టు నటించి క్షమార్పణ వేడుకోగానే - గాయత్రికి ఆశ్చర్యం కలిగింది. ఆ విస్మయంతో కొన్ని క్షణాలు ఏమీ మాటాడలేకపోయింది. తరువాత సర్దుబాటు చేసుకొన్నది. నిమాయ్ యీ విధంగా క్షమార్పణ కోరడంలో క్రొత్త యేమీ లేదు. దాంపత్య జీవనం జరిగిన స్వల్పకాలంలోను, అతడు చాలసార్లు అపరాధాలు చేయడం, మళ్ళీ అవన్నీ మరచిపొమ్మని క్షమార్పణ కోరడం చాలసార్లు జరిగింది. ఆ సమయంలో అతనికే మాత్రం లజ్జగాని, సంకోచంగాని అనుభవించినట్టు లేదు. ఈసారి మళ్ళీ అదే పద్ధతిగా మాటలు ప్రారంభించి, నిమాయ్ గాయత్రిని బదులు చెప్పకుండా చేశాడు. ఇప్పటి నిమాయ్ కంఠంలో క్రొత్త స్వరం వినిపిస్తున్నది. ఈ కంఠస్వరం ఇదివరకు చిరపరిచితమైన నిమాయ్ కంఠస్వరంకాదు. ఇతడింకో క్రొత్త నిమాయ్!

ఆశ్చర్యంవలన కలిగిన మొదటి "షాక్"లోనించి తేరుకొని గాయత్రి నిమాయ్‌కి బదులుచెప్పింది. ఆజవాబు, ఆమె కంఠం సవరించుకొని అతి స్పష్టంగానే చెప్పింది: "ఈ మాట చెప్పడానికేనా, యీ వేళ మంచి ముహూర్తం చూచుకుని, యీ శుభదినంనాడు యింతదూరం పనికట్టుకొని వచ్చారు?" ఆ మాటలలో వ్యంగ్యం పరిస్ఫుటంగా కనిపిస్తున్నది. అయితే అటువంటి మందలింపులకు బెదరిపోయే

వాడు కాదు నిమాయ్. ఆమె మాటల ధోరణి నిమాయ్ బాబు చేసిన తీవ్ర నిశ్చయాన్ని ఎంతమాత్రమూ మార్చ లేకపోయింది. అతడు బొమముడిపాటుకూడ చేయక నవ్వుతూనే సమాధానం చెప్పాడు:

"నిజం చెపుతున్నాను గాయత్రీ. నీ కోరిక సాఫల్యం పొంది, పరీక్ష ప్యాస్ చేసినందుకు నా హృదయం ఆనం దంగా ఉంది. నీ వెంతో ఉదారంగా ఉంటావని నాకు తెలుసు. అందుచేత నన్ను క్షమించడం నీ కెంతో సహ జంగా యీ శుభదినంనాడు సాధ్యమవుతుంది. ఇంకెన్నడూ జరగనిది యీవేళ జరుగుతుందని నే నెరుగుదును. అందుకే యీ శుభముహూర్తం చూచుకొని వచ్చాను."

గాయత్రి గంభీర శాంత కంఠస్వరంతో బదులు చెప్పింది:

"అసలు క్షమించడం అనే ప్రశ్న యెందుకు వచ్చింది?"

"ఎందుకొచ్చిందంటావా? నీ వద్దనుంచి క్షమార్పణ కోరి సాఫల్యం పొందకుండా నేను చచ్చినా గాని సుఖం అనేది ఉండదు."

చావు అనేమాట యే స్త్రీ కూడా సహించలేదు. గాయత్రి అందుకే అన్నది:

"మాటిమాటికీ చావుమాట తెస్తా రెందుకు? ఆ మాట చెప్పి వల్లిస్తే ఏమైనా మంచిభావన కలుగు తుందనా?"

నిమాయ్ నవ్వుతూ బదులు చెప్పాడు: "చావు అనే భావన మనిషిమనస్సులో అన్ని వేళల్లోనూ అలాగ మెదులుతూనే ఉంటుంది గాయత్రీ! ఏ క్షణంలో ఎవడు మరణిస్తాడో ఎవరు చెప్పగలరు? ఈ చావుకు ఏదైనా స్థిరత్వం ఉంది కనకనా?"

ఈ మాటలు గాయత్రికి వెగటు కలిగించాయి. ఏదో జవాబు చెప్పాలి కనక అనేసింది: "లేకపోవచ్చు; లేకపోతేయేం?"

నిమాయ్ తీయగానవ్వుతూ "ఈ స్థిరత సంపాదించడానికి తగిన ఉపాయంకూడా ఏమీ లేదు. అందుచేత క్షమార్పణ అనేది లేకపోతే—"

"మిమ్మల్ని క్షమించడమైనా, క్షమించకపోవడమైనా నా వద్దనుంచి రావలసిన ప్రశ్న కాదు."

"కాని నా వద్దనుంచి వచ్చిందికదా ఆప్రశ్న? నీలోనే ఉండిపోయింది క్షమించవలసిన బాధ్యత."

"నాలో ఏముంది? పరస్పర సంబంధం ఉన్నంతవరకు ఆ బాధ్యత ఏమైనా ఉండేదేమోకాని, మన సంబంధం తెగ తెంపులు అయిపోయిన తర్వాత మిగిలిందేముంది? క్షమించవలసిందేముంది నా విషయంలో?"

"నా విషయం అలాగ కాదు. నేను క్షమిస్తావా అని ప్రశ్నిస్తున్నంతవరకు ఆ సంబంధం ఉండనే ఉంటుంది. అది యెన్నటికి తెగతెంపులు కాదు." అని తీయని నవ్వులొలికిస్తూ జవాబు చెప్పాడు నిమాయ్.

ఇంతలో తపన్‌ముఖర్జీ అటువైపు వచ్చి చూచాడు.

నిమాయ్‌బాబును ఇదివరకెన్నడూ తపూ చూడలేదు. ఇతడెవరు? ఎందుకొచ్చాడు? తెలియలేదు. అక్కడనించి వెళ్ళిపోయాడు. తెలుసుకోవాలనే కుతూహలం ఉంది. అటూ యిటూ తచ్చాడుతూ వచ్చి, ఒక మూల పొంచి కూర్చున్నాడు. ఎదురుగా ఒక కుర్చీలో కూర్చున్న నిమాయ్ కనిపిస్తున్నాడు.

మెల్లమెల్లగా సంగతి బోధపడింది. పూర్తి వివరాలు తెలిసేవరకు అభాసచేయకుండా అక్కడ కూర్చుండి వారి సంభాషణ వింటున్నాడు.

ప్రక్కగా మంచంమీద జబ్బుతో పడుకొని ఉన్న అన్నయ్య మానస్, ఎదురుగా గాయత్రి అంతవరకు నిలుచుండి అటూ యిటూ తిరుగుతూ ఒక ఓరగా కూర్చున్నది. ఎదురుగా ఒక కుర్చీలో నిమాయ్‌బాబు. ఇవన్నీ అటునుంచి పరికించి చూశాడు తపన్. వ్యవహారం అవగాహనలోకివచ్చేటప్పటికి అతనికి యెంతో సిగ్గు కలిగింది. అక్కడనుంచి వేరే గదిలోకి వెళ్లాలని బయలుదేరాడు. ఒక్క క్షణంలో బయటికి వచ్చాడు మెరుపులాగ! సత్యభామకూడ అక్కడే నిలువబడి, నిశ్శబ్దంగా వాళ్ళ మాటలు గోడప్రక్కనుంచి వింటున్నది. తపూను చూడగానే ఆమెకూడ సిగ్గుపడిపోయింది. క్షణంలో సమాళించుకొని, ఆ అబ్బాయివెంట మెల్లగా అడుగులువేస్తూ సన్నని గొంతుతో అడిగింది:

"ఎవరురా తపూ అతను?"

"ఎవరికితెలుసు?" అని అలక్ష్యంగా జవాబు చెప్పాడు తపన్.

"ఏమిటంటాడు అతను?" మళ్ళీ అడిగింది తల్లి.

అనావశ్యక ప్రశ్నలకు జవాబు ఏమీ చెప్పలేక పోయాడు తప్పా. ఎదురుగా తలుపు తెరచినట్లయింది.

నిమాయ్ వేస్తున్న ప్రశ్నలకు గాయత్రి జవాబు చెప్పలేకపోయింది. ఇన్ని అనుమానాలు చేసి, ఇంత పరాభవం పొందిన తర్వాత యింతదూరంవచ్చి, సమార్పణ వేడుకొని కాళ్ళవేళ్ళాపడి బ్రతిమాలడం ఆమె భావనకు అతీతంగా కనిపించింది. ఆమె మానస్ వైపు చూచింది.

మానస్ కళ్ళుమూసుకొని నిశ్శబ్దంగా నిద్రపోతు న్నాడు. నిశ్చలంగా అతని ముఖం కనిపిస్తున్నది. ప్రశాంత భావం. ఏమి వింటున్నాడో, ఏమి భావిస్తూ ఉన్నాడో, ఏమీ పైకి తెలియడంలేదు. తెలిసే ఉపాయంకూడ లేదు! ఒకే ప్రశాంతత; ఒకే గంభీరత; ఒకే నిశ్చల నిర్వికారభావన! గాయత్రిమనస్సులో ఆవేదన అతనికి అర్థమైతే, ఎలాగ ఉండేదో, ప్రత్యేకంగా ఆ మాటలన్నీ వింటే అత ఎంతగా బాధపడతాడో ఆమె ఒక్కక్షణం ఊహించుకుంది. నిమా య్‌కి ఏదో బదులు చెప్పాలి. మొదలుపెట్టింది:

"నిమాయ్ బాబు! ఆవేళ ధర్మతలాలో అలాగ జరిగిన తర్వాత మీరింతదూరం వెతుకుకొంటూ, ఇన్నాళ్ళతర్వాత యిలాగ వస్తారని నేను కలలోకూడ భావించలేదు."

ఎంతమాత్రం చలించకుండా నిమాయ్ బదులు చెప్పాడు.

"అలాగ భావించవలసిన అవసరమే లేకపోయింది. నాకే ఆ అవసరంకలగలేదు. నిజానికి, తన మనసులో ఏ

భావనలున్నాయో యే మనిషికి తెలుస్తుంది. తానేమిచేయబోతు న్నాడో తనకే సరిగా తెలియదు" నిమాయ్ హో హో మని పెద్దగా నవ్వుతున్నాడు. గాయత్రి యేదో చెప్పబోయింది. అటు మానస్‌కేసి చూసింది. మానస్ ఆమెకేసి పరికించి జబ్బుచేత క్షీణమైన కంఠంతో నీరసంగా పలికాడు:

"గాయత్రీ, నీ జీవితంలో పరీక్ష ప్యాసయిన మొదటి శుభదినంనాడు, పెద్దమనిషివస్తే వారికి 'టీ' అదీ యివ్వడం ఏమీ లేదా?"

"అవును, అన్నట్టు - ఇప్పుడే 'టీ' చేసి తెస్తాను" అని తొందరగా లోపలికి వెళ్ళిపోయింది.

గాయత్రి వెళ్ళిన వెంటనే, మానస్ - నిమాయ్‌ని తన ప్రక్కమీదకువచ్చి కూర్చోమని సైగచేశాడు. వచ్చి కూర్చున్నాడు. తానుకూడ ప్రక్కమీద లేచి కూర్చు న్నాడు. "అవును అతనే ఆ పెద్దమనిషి ఆవేళ ధర్మతలా మలుపులో, మోటారుకారులో కనిపించింది అతడే. చాల పెద్ద మోటారుకారు. ఆవేళ, విదేశీ సూట్ వేసుకొన్నాడు. ఈవేళ ఆమోటారుకారూలేదు. ఆ దొరవేషంలేదు, సూట్ బూట్ లేదు, మామూలుపంచె, లాల్చీ. అవికూడ మాసిపోయి వున్నాయ్. కన్నులలో అప్పటి దర్పంలేదు. చూపులలో బెంగ జాలి. అయితే, మనిషిమాత్రం అతనే. నిమాయ్ చక్రవర్తి. అలాంటి పేరేదో గాయత్రి ఒకసారి చెప్పింది. కాని అది సరిగా జ్ఞాపకంలేదు. అతనిని ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. మానస్ నీరసంగా ఉన్నా, నిశ్చలమైన కంఠంతో పలకరిం చాడు.



"మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడగాలనివుంది. అవి చెప్పిన తర్వాత గాయత్రికి నచ్చచెప్పవచ్చును. అప్పుడు తప్పకుండా అవగాహనచేసుకుంటుం దామె.

"అవును – ఆమెకేమీ అర్థంకావడంలేదు. ఆమెకు మీరు నచ్చచెప్పి వొప్పిస్తే తప్పకుండా అవగాహనచేసు కుంటుందనుకుంటాను" అని నిర్మమతగా నిమాయ్ బదులు చెప్పాడు.

"అందుకే మరి! గాయత్రి టీ తెచ్చేలోపున చకచక మీరు బదులు చెబితే నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. మీరు చెప్పగలరా?"

"అడగండి"

"మీకే ప్రశ్న అయినా అసౌకర్యంగా ఉన్నదని తోస్తే దానికి జవాబు చెప్పనక్కరలేదు. అయితే దేనికీ అబద్ధాలుమాత్రం చెప్పవద్దు"

నిమాయ్ యీ మాట వినగానే విద్యుత్ రేఖ ప్రవహించినట్లు చకితుడై క్షణంలో నిబ్బరించుకొని అన్నాడు: "ఓ దానికేం, అలాగే చెప్పవచ్చును."

"ఇన్ని రోజులు గడచిపోయిన తర్వాత తిరిగి ఈ వేళ వెదుకుకొంటూ ఎందుకువచ్చారు?"

నిమాయ్ లలాటభాగంలో బొమముడులు కొంచెం కదలినట్టయింది. శాంత కంఠంతో దానికి బదులు చెప్పాడు:

"తాను వివాహం చేసుకొని వరించినభార్యను వెదుకుకొంటూ తిరిగివస్తే అదేమయినా అన్యాయంలాగ, అక్రమంలాగ మీకు కనిపిస్తున్నదా!"

"భార్య - ఇంకొక్కడి భార్య - వివాహం విచ్ఛేదం చేసుకొని విడాకులిచ్చుకొన్నతర్వాత యింక భార్య యెలాగవుతుంది?"

నిమాయ్ మందస్మితవదనంతో - చిరునవ్వుతో బదులు చెప్పాడు:

"అదేమిటి? అన్నీ తెలిసిన మీరే అలాగంటారేమిటి? విడాకులిచ్చినంతమాత్రంచేత అయినభర్త కాకుండా పోతాడని మీ రెలాగ అనుకుంటారు."

"విడాకులయిన తర్వాత ఆమె మరొక వివాహం చేసుకొంటుంది" అందులో స్ఫురణ గ్రహించి, నిమాయ్ మళ్ళీ అందుకున్నాడు.

"ఇష్టమైతే చేసుకోవచ్చుననుకోవడి, కాని హిందూ స్త్రీ - సతి, సాధ్వి, మహాపతివ్రత - అటువంటిది వివాహం చేసుకోదు" అని నిమాయ్ పళ్ళు పైకిపెట్టి బిగ్గరగా నవ్వుతూ బదులు చెప్పాడు.

"ఆ ఆలోచనతో మీరు వచ్చి ఆమెను తిరిగి తీసికొనిపోవాలని అనుకొంటున్నారా!"

"ఆఁ- అవును, మీరు దయతో అనుమతిస్తే, నేను అలాగే ఆమెను స్వీకరించి తీసికొనిపోవాలని ఉంది."

మానస్ విస్మయంతో తెల్లబోయాడు.

"మధ్య నా అనుమతి యివ్వడం ఏముంది. యీ విషయంలో మీ యిద్దరి వ్యవహారంలో నాకేం జోక్యం ఉంది?"

"ఉంది. అది ఎలాగుందో మీకూ తెలుసు. నాకూ తెలుసు. నేను అనుమానించాను. ఆ మాత్రం సులువుగా గ్రహించగలను. ఆ మాత్రం మీకు తెలియదూ?" యీ మాటలు విని మానస్ సహించలేకపోయాడు. "లేదు, నాకేం తెలియదు. మీరు అన్యథా భావించకపోతే, మీరేమి అనుమానించారో ఏమి గ్రహించారో చెప్పగలరా?"

నిమాయ్ బదులు చెప్పకుండానే గాయత్రి టీ ఒక ప్లేటులో పెట్టుకొని, మరొక పళ్ళెంలో ఫలహారం పట్టుకొని లోపల ప్రవేశించింది. ఆమెను చూడగానే - మాటలు నిలిపి ఆ ప్రసక్తి అలాగ ఉంచి "టీ తీసుకోండి-" అని అన్నాడు.

టీఫలహారం గాయత్రి అక్కడ ఉన్న చిన్న టీపాయ్ మీద పెట్టింది. టీకప్పు చేతిలోకి తీసుకొని నిశ్శబ్దంగా త్రాగినతర్వాత

పరితృప్త భావంతో అన్నాడు: "ఈ టీ ఉంది చూశారూ, మానస్ బాబు! అచ్చు గాయత్రిలాగే ఎంత తీపిగా ఉందను కొన్నారు!" ఇంతలో గాయత్రికేసి చూస్తూ ఆమెను ప్రశం సించడం మొదలు పెట్టాడు:

"సుప్రసిద్ధమైన యీ టీని నీతో సమానంగా ప్రశం సించేవాడిని గాయత్రీ! జ్ఞాపకం ఉందా?"

గాయత్రి జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నించి అన్నది:

"అలాంటిదేమీ జ్ఞాపకం రాలేదే!"

"నీకు జ్ఞాపకంలేదేమో! నాకు జ్ఞాపకం ఉంది. ఒక సారి గుర్రపు పందాలకు వెళ్ళి – అందులో చాల డబ్బు పోగొట్టుకొని విచారంతో తిరిగి వచ్చాను. తలకాయ నొప్పి బాధ–భరించరాని వేదన. కొంచెం టీ తెస్తావా అని పిలిచాను. నీవు అప్పుడు మంచి టీ చేసి యిచ్చావు. తల నొప్పి గిలనొప్పి అన్నీ పోయాయి. అప్పు డన్నాను జ్ఞాపక ముందా? ఇలాంటి టీ దొరికితే, రేసులలో రోజూ డబ్బు పోయినా యిబ్బంది ఉండదు అని"

నిమాయ్ హా హా మని నవ్వుతున్నాడు. "జ్ఞాపకం రావడంలేదూ!" అని కేరింతలుకొట్టూ అడుగుతూవుంటే గాయత్రి జవాబు చెప్పలేదు. రెట్టించి అడిగేటప్పటికి, యీ సారి బదులు చెప్పింది: "లేదు, జ్ఞాపకంలేదు."

మళ్ళీ ఆశ్చర్యపడినట్టు ముఖంపెట్టి నిమాయ్ అందు కున్నాడు.

"ఆవేళ సంధ్యాసమయంలో, ఆ నీరెండలో నీవు-అందంగా అలంకరించుకుని సుందర విగ్రహంలాగ ప్రత్యక్షమయ్యావు. అపుడు తెలిసింది — యిదంతా సినీమాకు బయలుదేరే సన్నాహమని — మనం సినీమాకు వెళ్ళాం. జ్ఞాపకంలేదూ !"

గాయత్రి జవాబు చెప్పలేదు. విరక్తభావంతో ముఖం తిప్పుకొని అలాగే ఉంది. నిమాయ్ విషయం మార్చాడు. తనలో తానే చెప్పుకొనిపోతున్నాడు.

"విడాకులు, వివాహ విచ్ఛేదం అంత త్వరగా సహజంగా జరుగుతుందా ? ఇదంతా నాటకాలలోనూ నవలలలోనూ జరుగుతుంది. యథార్థజీవితంలో అసంభవం. సాలగ్రామంముందు ప్రదక్షిణచేసి, వివాహబంధం ఏర్పడిన తర్వాత - అది విచ్ఛేదంచేయడం ఎవరిసాధ్యం ? అగ్నిహోత్రం సాక్షిగా జరిగిన వివాహ బంధం తిరిగి — చచ్చి చితిలో అగ్నిహోత్రంలో ప్రవేశించేవరకు తప్పేదికాదు. తప్పులు, పొరపాటులు రావచ్చు. అవి కేవలం మనుష్యమాత్రులవల్ల జరిగే తప్పులు, పొరపాటులు. అవి పరిష్కారం చేసుకోవచ్చు; దిద్దుపాటు చేసుకోవచ్చు. అప్పుడు మరీ బాగుంటుంది; తర్వాత జీవితం మరెంత మధురమయం అవుతుంది. వానజల్లు పడినతర్వాత శుభ్రంగా ఉన్న రాజమార్గంలాగ మరింత ప్రకాశిస్తుంది. మానస్ బాబూ! ఏమంటారు ? మీరు నా మాటలంటే విశ్వసిస్తున్నట్లు లేదు ?"

"ఆఁ ... అదికాదు" అని తడబాటుగా బదులు చెప్పాడు మానస్.

"గాయత్రిమాత్రం తప్పక విశ్వసిస్తుంది. ఆమె రక్త నాళాల్లో సీత,సావిత్రివంటి పతివ్రతలరక్తం ప్రవహిస్తున్నది."

గాయత్రి ఆ మాటలు విని పెద్దగా నవ్వింది. అంతటితో ఆ ప్రసంగం ఆపివెయ్యాలన్నట్టు లేచింది. నిమాయ్ కూడ లేచాడు ఇంకా పూర్వధోరణిలోనే అన్నాడు: "ఏమంటావు గాయత్రి! నా ఉద్దేశం హిందూ స్త్రీ రక్తనాళాల్లో సీత, సావిత్రి ఇటువంటివారి రక్తం ప్రవహిస్తూ ఉంటుందని" నిమాయ్ ఆ మాట అని పెద్ద నిట్టూర్పు తీసుకొన్నాడు. ఆ దీర్ఘ నిశ్వాసంలో ఏమి అర్థం యిమిడి ఉందో! గాయత్రి, లజ్జతో ముఖం వాల్చుకొని - పైకి లేచి నిబ్బరంగా బదులు చెప్పింది:

"చూడు, ఈ నిట్టూర్పులూ, నిశ్వాసాలూ ఏమీ లాభంలేదు. మీలాంటివాళ్ళలో శ్రీరామచంద్రుడు, సత్యవంతుడు ఇటువంటి మహాపురుషుల రక్తం ప్రవహించడం మానివేసినట్లే, మావంటివాళ్ళ రక్తనాళాల్లో సీత, సావిత్రి యిలాంటి పతివ్రతల రక్తం కూడా ప్రవహించడం మానివేసింది. దానికి ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆ విషయాలు నీ ముఖతః వినవలసిన అవసరం లేదేమో!"

"ఓ అలాగా!" అని నిమాయ్ తగ్గిపోయాడు. అతని కంఠంలో పశ్చాత్తాపం, లజ్జ, దుఃఖం, పరాభవం అన్నీకలసి కంఠంలో మార్మ్రోగాయ్.

"నీ కంఠంలో సత్యం పలకడం అనేది ఉండదు. ఒక వేళ పలికితే అది వినవలసిన అవసరంకూడ లేకుండా చేశావు.



నిమాయ్: "ఓహో! అలాగనుకుంటున్నావా!" అని
నిమాయ్ ముఖం క్రిందికి దింపి
ఏదో ఆలోచించుకొంటున్నట్టు కూర్చున్నాడు.

"నిమాయ్ బాబు, ఇంకచాలు!" అని గాయత్రి గట్టిగా చెప్పింది.

"సత్యమో అసత్యమో అది ముఖంమీద వ్రాసిపెట్టి ఉంటుందా? ముఖస్థంగా వచ్చే మాటలలో సత్యంలేదని ఎవరనగలరు?"

"ఎవరైనా అనగలరు. తమరి ముఖతః వినే మాటలన్నీ అబద్ధాలే. తమరి సంగతి ఎవరికి తెలియదు. చోరాబజార్ చూడామణి – బ్లాక్ మార్కెట్ మేనేజర్ – నీవీనాడు

లోకానికి త్యాగంగురించి, ధర్మంగురించి నీతులు చెప్పితే ఎవరు నమ్ముతారు! ఏదో - ధోరణి మార్చాడు. దీనికేదో కారణం ఉంటుందని అందరూ ఇట్టే గ్రహిస్తారు!"

"ఓహో - అలాగనుకుంటున్నావా ?" అని నిమాయ్ ముఖం క్రిందికివంపి ఏదో ఆలోచించుకొంటున్నట్టు కూర్చున్నాడు. మళ్ళీ ముఖం పైకెత్తి తెలివిగా జవాబు చెప్పాడు.

"ఎవరు చెప్పగలరు? ఏ క్షణానికి ఏమార్పువస్తుందో! రత్నాకరంనుంచి పిలుపు వచ్చేటప్పటికి - ఒక బందిపోటు మహాకవి వాల్మీకి అయ్యాడు" మానస్ జరుగుతూన్న సంభాషణ అంతా నిశ్శబ్దంగా వింటున్నాడు. ఈ మాట వినగానే నవ్వు వచ్చింది. నిమాయ్ కేసి చూచి ప్రశ్నించాడు.

"నిమాయ్ బాబూ! రాత్రికి రాత్రి అటువంటి పరివర్తన వచ్చేస్తుందని అంటారా ? మీ ఉద్దేశంలో."

"నా ఉద్దేశంలో — యిటువంటి పరివర్తన రాత్రికి రాత్రి, ఒక్క ముహూర్తంలో రావచ్చు నంటాను. అంతవరకు ఏమో తెలియకుండా ఉన్న వాల్మీకి ఒక్క క్షణంలో ఆ చెట్టుమీద క్రౌంచపక్షుల్ని చూచి, "మా నిషాద ప్రతిష్ఠాం" అని మొదలుపెట్టాడే. అది అందరికీ తెలిసిందే కదా! పరివర్తన రావడానికి ఎంతసేపు కావాలి. ఒక్క క్షణం చాలు. అది ఎప్పటికి వస్తుందో అంత పర్యంతం ఎదురుచూస్తూ ఉండాలి." అని ఒక్కసారి నిమాయ్ పైకి లేచాడు.

"నేనూ అంతే-ఇన్నాళ్ళూ ఎదురుచూస్తూ ఉన్నాను.

లోపల లోపల, పైపైన తవనపడుతున్నాను. ఆ తపన- ప్రజల ముందు ఇప్పటికి బయటపడింది. దానికి ప్రతిఫలం కలుగుతుంది. అంతే" అని అన్నాడు. ఇంతలో గాయత్రి తాను టీకి వెళ్ళిన సమయంలో మానస్‌బాబూ నిమాయ్ ఏమి మాటలాడుకొన్నారో యేమీ యెరుగదు. అందులో లవలేశం కూడా తెలియదు. నిమాయ్ ఇంత ఉత్తేజభావంతో మాటలాడడం, దృఢ సంకల్పభావంతో నిశ్చయంచేసినట్లు చెప్పడం ఆమెను ఆశ్చర్య చకితురాలనుచేశాయి. ఆమె నిమాయ్‌ని తిరిగి ప్రశ్నించింది.

"ఎవరిని గురించి నీ వింతగా పరితపించి ఎదురుచూస్తున్నావో తెలుసుకోవచ్చా!"

"నీకోసమే — ఎదురు చూస్తున్నాను. నీకోసమే ఇంత దూరం వెదుకుకొంటూ వచ్చాను. ఈ ముహూర్తంకోసమే ఇన్నాళ్లూ ఎదురుచూశాను. నిన్ను నా వెంట తీసికొనిపోవాలని వచ్చాను."

"మరి నీ రెండవభార్య సంగతి?"

"ఆమె నన్ను మోసగించింది."

"చనిపోయిందా?"

"అవును."

గాయత్రి నవ్వలేదు. గంభీరంగా పలికింది.

"అదృష్టవంతురాలు. ఆమె చనిపోయింది. చావడం నావల్లకాలేదు. అలాంటి ఆలోచనలేదు. నే నొక్క మాట చెప్తాను వింటారా?"

"చెప్పు"



గాయత్రి : తిరిగి మీతో కాపురంచెయ్యడానికి
యేనాటికీ రాను. యిది నా నిశ్చయం."

"మీరు దేనికోసం అపేక్షపెట్టుకోనక్కరలేదు."

"ఎందుచేత?"

"అపేక్ష పెట్టుకొని లాభం ఏముంది? ఒక్కక్షణంలో ముహూర్తమాత్రంలో పరివర్తనపొంది వాల్మీకిలాగున మారిపోయానని అన్నారు, జ్ఞాపకం ఉందా? అతడు మామూలు మనిషినుంచి మహాకవి యెలా అయ్యాడో మాత్రం చెప్పలేదు. మొదటి విషయం అలాంటి పరివర్తన మీలో రావడం అసంభవం."

"రెండవది."

"రెండవది — మీరు వాల్మీకిగా మారినా మారక

పోయినా తిరిగి మీతో కాపురం చెయ్యడానికి ఏనాటికీ రాను. ఇదీ నా నిశ్చయం."

అకస్మాత్తుగా వజ్రపాతంవంటి పిడుగు పడితే ఎలాగ వుంటుందో అలాగయింది. నిమాయ్ బాబు స్తబ్ధుడయ్యాడు. మాటరాలేదు. మానస్ తీక్షణ దృష్టితో గాయత్రివైపు చూచాడు. ఆ చూపు నిమాయ్ బాబుకి విహ్వలత కలిగించింది. కొంతసేపు అయినతర్వాత నిమాయ్ జాలిగా ప్రార్థించాడు.

"నేను మంచివాడినిగా మారిపోయినాగాని నాతో వచ్చి వుండవూ గాయత్రీ!"

"రాను."

"అయితే, నన్ను మార్చి, మంచివాడినిగా చేయడానికి రావూ? నన్ను బాగుచేయాలని లేదూ!"

"నేను ముందే చెప్పాను. నీ విషయంలో బాగు చేయడం అనే సమస్య లేనేలేదు."

"ఎందుకు లేదు!"

"లేదు. భార్యాభర్తలమధ్య ఉన్న సంబంధం ఏకోశాన తిరిగి మొలకెత్తడం ఉండదు."

"భార్యాభర్తల సంబంధం తిరిగి మొలకెత్తడం అనేది ఉండదు." ఈమాటలు తిరిగి తిరిగి ఉచ్చరిస్తూ ఆలోచించడం మొదలుపెట్టాడు.

కొంతసేపయిన తర్వాత దాని అర్థం బోధపడింది. క్రమక్రమంగా అతని ముఖంలో భావాలు కఠినంగా, ఖచ్చితంగా, హింసా దౌర్జన్యంగా మారిపోయాయి. ఆ భావా

లతో అసలు నిమాయ్‌చక్రవర్తి బయటపడ్డాడు. అకృత్రిమ-స్వాభావిక నిమాయ్‌చక్రవర్తి. గాయత్రిని ఆవేళ చెంపమీద కొట్టినప్పుడు ఎటువంటి అవతారం దాల్చాడో, అలాంటి ముఖ భావమే వచ్చింది. క్రూరకంఠంతో ప్రశ్నించాడు :

"అయితే నీ ఉద్దేశం ఏమిటి గాయత్రీ? మానస్ బాబును పెళ్ళిచేసుకుంటావా?"

గాయత్రి ఒక క్షణంసేపు స్తబ్ధురాలయింది. ఏమీ పలకలేదు. తరవాత కొంచెం సర్దుకొని స్పష్టంగా చెప్పింది:

"అయితే విను — నా నిశ్చయం. మానస్‌బాబును పెళ్ళిచేసికోవాలనే కోరిక నాకు ఎన్నడూ లేదు."

గాయత్రి ఒక్కక్షణం ఆలాగే ఉండిపోయింది. ఎటూ చూడలేకపోయింది. ఆమె మాట వినగానే మానస్ ముఖం తెల్లకాగితంలాగ వెలవెలపోయింది. నిమాయ్ అటు చూడలేకపోయాడు. ఉలకకుండా పలకకుండా మనస్సులో కలిగిన ఉత్తేజనాభావంతో ఉడుకుమోతుతనంతో చిందులు త్రొక్కుతూ వెళ్ళిపోయాడు.

"ఎవరికీ స్వాధీనంకాకుండా, ఆత్మధనాన్ని కోల్పోకుండా తనస్వాతంత్ర్యాన్ని, స్వగౌరవాన్నీ కాపాడుకొంటూ జీవించడం ఒకస్త్రీకి సాధ్యం అవునా? కాదా? అది జీవితమంతా పరీక్ష అయినాసరే ఎదురునిలిచి, ఈ పరీక్షలను ఎదుర్కోవాలనిఉంది. ఏమవుతుందో?"

అనుకొంటూ అక్కడ ఎదురుగావున్న టీ ట్రేలూ, కప్పులూ తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది గాయత్రి.

—: సమాప్తం :—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B107 |
| పుస్తకం పేరు | నాగరిక |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | susmitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |